తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

మే 2016 వెల రూ.5/-




"యీతఁడే కా వుపదేశ మిచ్చె నష్టాక్షరమంత్ర
మీతఁడే రామానుజులు యిహపరదైవము"

## శ్రీ భగవద్రామానుజుల సహస్రాబ్ది ఉత్సవ విశేష సంచిక



# తిరుపతి
# శ్రీ గోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవం

## 2016 మే 14 నుండి 22 వరకు

**14-05-2016 శనివారం**

పగలు: ధ్వజారోహణం - రాత్రి: పెద్దశేషవాహనం.

**15-05-2016 ఆదివారం**

పగలు: చిన్నశేషవాహనం - రాత్రి: హంసవాహనం.

**16-05-2016 సోమవారం**

పగలు: సింహవాహనం - రాత్రి: ముత్యపుపందిరివాహనం.

**17-05-2016 మంగళవారం**

పగలు: కల్పవృక్షవాహనం - రాత్రి: సర్వభూపాలవాహనం.

**18-05-2016 బుధవారం**

పగలు: పల్లకీలో మోహినీఅవతారోత్సవం - రాత్రి: గరుడవాహనం.

**19-05-2016 గురువారం**

పగలు: హనుమద్వాహనం - రాత్రి: గజవాహనం.

**20-05-2016 శుక్రవారం**

పగలు: సూర్యప్రభవాహనం - రాత్రి: చంద్రప్రభవాహనం.

**21-05-2016 శనివారం**

పగలు: రథోత్సవం - రాత్రి: అశ్వవాహనం.

**22-05-2016 ఆదివారం**

పగలు: చక్రస్నానం - రాత్రి: ధ్వజావరోహణం.

# మాటలాడే దైవము...

గతులన్ని ఖిలమైనకలియుగమందును
గతి యీతఁడే చూపె ఘనగురుదైవము ॥పల్లవి॥

యీతని కరుణనేకా యిల వైష్ణవులమైతి -
మీతనివల్లనే కంటి మీ తిరుమణి
యీతఁడే కా వుపదేశ మిచ్చె నష్టాక్షరమంత్ర -
మీతఁడే రామానుజులు యిహపరదైవము ॥గతు॥

వెలయించె నీతఁడేకా వేదపురహస్యములు
చలిమి నీతఁడే చూపె శరణాగతి
నిలిపినాఁ డీతఁడేకా నిజముద్రాధారణము
మలసి రామానుజులే మాటలాడేదైవము ॥గతు॥

నియమము లీతఁడేకా నిలిపెఁ బ్రపన్నులకు
దయతో మోక్షము చూపెఁ దగ నీతఁడే
నయమై శ్రీవేంకటేశు నగమెక్కేవాకిటను
దయఁజూచీ మమ్ము నిట్టే తల్లితండ్రిదైవము ॥గతు॥

*( సంపుటం- 2, సంకీర్తన - 372)*

కలియుగంలో గొప్ప గొప్ప దారులన్నీ మూతబడిపోయాయి. మరికొన్ని మార్గాలు శిథిలావస్థకు చేరుకుంటున్న సంకటపరిస్థితుల్లో శ్రీరామానుజులవారు గొప్ప గురువుగా, దైవంగా అవతరించి సంసార చేతనులైన జీవులు సద్గతికి చేరుకొనే మార్గాన్ని ఉపదేశించారు.

"ఈ గురువు కరుణ చేతనే కదా మేము ఈ లోకంలో వైష్ణవుల మయ్యాము. ఈయన వల్లనే కదా మేము 'తిరుమణి' ధరించగలిగాము. ఈ మహానుభావుడే కదా మాకు అందరికీ 'ఓం నమోనారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించినవారు. ఇతడే... ఈ శ్రీరామానుజుడే మాకు ఇహానికీ, పరానికీ మిగిలి ఉన్న దేవుడు!".



"ఈయనే కదా వేదాల రహస్యాలన్నీ వెలయించినవారు. స్నేహమాధుర్యంతో ఈయనే కదా మనకు 'శరణాగతి'ని నేర్పించిన మహిత మానవతామూర్తి వారు. చిన్నవయసు లోనే తప్తముద్రా చక్రాంకనాలు స్వీకరించి శ్రీవైష్ణవమతాన్ని లోకంలో నిలిపినవారు ఈయనే కదా! మనకు తోడునీడై మాటలాడే దైవమంటే శ్రీరామానుజులే కదా!"

"ప్రపత్తి చేసిన ప్రపన్నులకు పరమాచారాలు ఈయనే కదా ఏర్పాటు చేసినది! ముముక్షువులకు మోక్షమార్గాన్ని చూపిన ఆచార్య పురుషుడితడే కదా! శ్రీ వేంకటాచలంపై నడిచివెళ్లే దారిలో 'త్రోవ భాష్యకారులు' గా వెలసినవారు శ్రీరామానుజులే కదా! అటువంటి తల్లీ, తండ్రీ, దేవుడూ అయిన శ్రీరామానుజుల వారు మమ్మల్ని యిలాగే ఎప్పుడూ దయతోచూచి కాపాడాలి".



## శ్రీవేణుగోపాలస్వామివారి బ్రహ్మోత్సవాలు, కార్వేటినగరం

| తేదీలు | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 27-5-2016 | శుక్ర | --- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 28-5-2016 | శని | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 29-5-2016 | ఆది | చిన్నశేషవాహనం | హంసవాసనం |
| 30-5-2016 | సోమ | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 31-5-2016 | మంగళ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 01-6-2016 | బుధ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 02-6-2016 | గురు | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 03-6-2016 | శుక్ర | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 04-6-2016 | శని | రథోత్సవం | అశ్వవాహనం |
| 05-6-2016 | ఆది | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 46 మే, 2016 సంచిక : 12



వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి ॥

**గౌరవ సంపాదకుడు**
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

**పర్యవేక్షకుడు**
శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్. (విశ్రాంత),
ప్రత్యేకాధికారి, ప్రాజెక్టులు, తి.తి.దే.

**ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు**
డా॥ సి.శైలకుమార్

**సంపాదకుడు**
డా॥ కె.రాధారమణ

**ఉపసంపాదకురాలు**
డా॥ అల్లాడి సంధ్య

**ముద్రాపకుడు**
శ్రీ వి.వీరబ్రహ్మయ్య, ఎం.ఏ., బి.ఇడి.,
ఉపకార్యనిర్వహణాధికారి(ప్రచురణలు & ముద్రణాలయం),
తి.తి.దే., తిరుపతి

**వర్ణ చిత్ర పుటలు**
పి.శివప్రసాద్

**పుటలు రూపకల్పన**
బి.గురుకుమార్ రెడ్డి

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

## ఈ నెలలో....



**ముఖచిత్రం :** శ్రీమహావిష్ణువు, శ్రీభగవద్రామానుజులు
**వెనుకచిత్రం :** ఇందరి జయంతులు ఈ వైశాఖమే



24 గంటలు పనిచేసే తి.తి.దే. కాల్‌సెంటర్ ఫోన్ నెం.
0877 2277777 / 2233333



శ్రీభగవద్రామానుజుల విశేషసంచిక సందర్భంగా ధారావాహికలు ప్రచురించలేకపోతున్నాం. పాఠకులు గమనించగలరు.



# శ్రీమతే రామానుజాయ నమః

ఒక ఉదయంవేళ ఒక పెద్దాయన వీథివెంట వెళుతున్నారు. దారిలో కొంతమంది పిల్లలు నేల మీద గీతలు గీసి ఆలయం అంటూ అనుకరిస్తూ పూజలు చేస్తున్నారు. మట్టిని పోగు చేసి ప్రసాదం అని పంచుతున్నారు. పెద్దవాళ్లుచూసి నవ్వుకుంటూ వెళ్లుతున్నారు. కానీ, దీన్ని చూసిన మన పెద్దాయన వాళ్లదగ్గరికెళ్ళి వారిచ్చిన మట్టిని ప్రసాదంగా భక్తితత్పరతతో స్వీకరించారు.

“పసిపిల్లలు కూడా భగవద్భావన చేయగలరు. తమ కల్పనానుసారంగా భగవంతుణ్ణి ఆరాధించగలరు. వారి ఆలయం నిజంగా భగవంతుడు నివసించేచోటే! వారక్కడ భగవంతుణ్ణి చూస్తున్నారు కనుక!” అని చెప్పి పెద్దాయన ముందుకు వెళ్లిపోయారు.

* * * * * * *

శ్రీరంగంలో చైత్రోత్సవ సమయం వీథివెంట పొన్నాచి అనే అందాలరాశి నడిచివెళుతోంది. ఆమెకు ఎండ తగులకూడదని ధనుర్దాసు అనే యువకుడు గొడుగుపట్టాడు.

ఆ దారి వెంట శిష్యులతో వెళ్లుతున్న ఓ గురువుగారు ఇది గమనించారు. శిష్యులు ధనుర్దాసు మోహావేశాన్ని చూచి అసహ్యించుకోసాగారు. గురువు మాత్రం ఓ చిన్న నవ్వు నవ్వి, “ఆ వ్యక్తి కామాంధుడు కాదు, స్వచ్ఛమైన ప్రేమికుడు. ఆ ప్రేమ ఎంత గొప్పదంటే ఎవరేమనుకున్నా లక్ష్యం చేయనీయదు. ఇతణ్ణి భార్య ప్రేమ నుండి భగవత్ప్రేమవైపు తిప్పడం ఏమంత కష్టం కాదు” అన్నారు.

అతణ్ణి తీసుకెళ్ళి అనంతసౌందర్యకోశాలైన శ్రీరంగనాథుని నేత్రాలను చూపించారు. అతనిలో అంతర్ నేత్రం తెరుచుకుంది.

* * * * * * *

వేయి సంవత్సరాల క్రితం మాలాధరులనే మహాపండితులు ఉన్నారు. ఆయన తిరువాయ్‌మొళిని అద్భుతంగా వ్యాఖ్యానించగలరు. దానిని నేర్పమని మాలాధరుల్ని ఆశ్రయించాడు ఒక శిష్యుడు. వింటున్న శిష్యుడికి ఆ స్తోత్రంలో అనేక అర్థాలు స్ఫురించసాగాయి. గురువుగారి వ్యాఖ్యాన ప్రవాహం ముందుకు సాగడం లేదు. గురువుగారికి కోపం వచ్చింది. అప్పుడు శిష్యుడు ప్రశాంతంగా నవ్వి “అయ్యా! ఒక గ్రంథం గొప్పతనం నూతన అర్థాలు ఇవ్వడం వల్ల పెరుగుతుందే కాని, తరగదు. నూతన అర్థాలు చెప్పడం సంప్రదాయక అర్థాలను ఎదిరించడం కాదు” అని మనవి చేశాడు. మాలాధరులు ఆశీర్వదించి శిష్యునికి మంగళాశాసనం పలికారు.

* * * * * * *

ఈ సంఘటనలన్నింటిలో మహోన్నతంగా ఆర్ద్రంగా ఆలోచించిన మహానుభావులే రామానుజుల వారు. భగవంతుని పట్ల ప్రేమ, సాటిమానవుల పట్ల వాత్సల్యంతో జీవిత పర్యంతం జీవితాన్ని భగవదాదేశంగా గడిపారు. మానవ జీవిత విముక్తికోసం పరమాత్మ శ్రీచరణాలను ఆశ్రయించడం ఒక్కటే మార్గమని బోధించారు. భగవంతునికి, భక్తునికి మధ్య భక్తిబంధం మాత్రమే శాశ్వతం. భక్తికి జాతి, లింగ, వయోభేదాలు లేవు. పరమాత్మ దృష్టిలో భక్తి ఒక్కటే ప్రధానం. భగవంతుని శరణుజొచ్చిన వారిని భగవంతుడు చేయిపట్టుకుని నడిపిస్తాడని సందేశమిచ్చారు. వేయి సంవత్సరాల క్రితం జనుల మధ్య మసులుతూ ఆయన మనస్సును, శ్వాసను, ధ్యాసను సమస్తాన్ని లోకంకోసం, లోకకల్యాణం కోసం జీవితాన్నే శరణాగతిగా గడిపిన మహానుభావుల **వేయి సంవత్సరాల పండుగ ఈ నెల మే, 10న ఆరంభమై ఈ యేడాదంతా జరుగబోతుంది.**

**ఈ సంవత్సరమంతా తిరుమల తిరుపతి దేవస్థానం సప్తగిరి సంచికలో ప్రతినెలా ఆయన జీవితవిశేషాల్ని, ఉజ్జ్వల ఘట్టాల్ని, పరిచయం చేయాలని సంకల్పించింది.** ఆయన చూపిన వెలుగుదారుల్లో నడిచి పరతత్త్వాన్ని, లోకహితార్థాన్ని ఆచరిద్దాం.




– డా॥ ఈ.ఏ.సింగరాచార్యులు,
98850 03420

విశిష్టాద్వైతసిద్ధాంత ప్రవర్తకాగ్రేసరులైన శ్రీ రామానుజుల సహస్రాబ్ది మహోత్సవాలు ఆసేతుహిమాచలం లోనే కాక, జగద్వ్యాప్తంగా జరుగుతున్న ఈ శుభతరుణంలో ఆ మహనీయుని విరాట్‌వ్యక్తిత్వంలోని కొన్ని అంశాలను ప్రస్తావించడం సందర్భోచితం. ఆ మహానుభావుని పట్ల కృతజ్ఞతను ప్రకటించే ప్రయత్నం ఇది.

శ్రీరామానుజులు శ్రీవైష్ణవసంప్రదాయంలో ఆదిశేషావతారులుగా సంభావింపబడుతున్నారు. **"అనంతః ప్రథమం రూపం త్రేతాయాం లక్ష్మణస్తథా, ద్వాపరే బల భద్రశ్చ కలౌరామానుజః స్మృతః"** అనే ప్రసిద్ధమైన శ్లోకం ఈ విషయాన్ని తెల్పుతున్నది. ఈ విధంగా శ్రీరామానుజులను దివ్యాంశసంభూతులుగా భావించినపుడు వారి రూపం, చేష్టలు, మాటలు – అన్నీ దివ్యాలుగానే తోచడం సహజం. ఆ విధంగా కాకుండా, వారిని మానవునిగా భావించి, వారి చరిత్రను మనం పలు దృక్కోణాలలో పరిశీలించినపుడు, వారి విలక్షణాలైన లక్షణాలు ఎన్నో గోచరమవుతాయి. వాటిలో కొన్ని సంగ్రహంగా ఈ వ్యాసంలో ప్రస్తావింపబడుతున్నాయి.

## స్ఫురద్రూపం

శ్రీరామానుజులు కేశవసోమయాజి–కాంతిమతి దంపతులకు క్రీ.శ.1017వ సంవత్సరంలో పింగళనామ సంవత్సరం చిత్తిర (మేష) మాసం ఆర్ద్రానక్షత్రంలో కంచికి సమీపంలోని శ్రీపెరుంబూదూర్‌లో జన్మించారు. వీరి జన్మను విని వీరి మేనమామ తిరుమలనంబి(శ్రీశైలపూర్ణులు) తిరుమలనుండి శ్రీపెరుంబూదూరుకు వచ్చి, బాలుని రూపంలోని గొప్ప తేజస్సును చూచి **"లక్ష్మణో లక్ష్మి సంపన్న"** అనే రీతిలో గొప్పలక్షణాలను కల ఆ బాలునకు "ఇళైయాళ్వార్" (రామానుజుడు– లక్ష్మణుడు) అనే పేరు తగినదని భావించి, ఆ పేరును పెట్టారు.

శ్రీరామానుజులు కంచిలో యాదవప్రకాశుల దగ్గర వేదాంతవిద్యను అభ్యసించేటపుడు శ్రీయామునులు శ్రీరామానుజుల మేధా విలాసాన్నిగూర్చి విని, వారిని చూడాలని ఆశపడ్డారు. యాదవప్రకాశులు తన శిష్యులతో పాటు వరదరాజస్వామి ఆలయంలో ప్రదక్షిణంగా వచ్చే సమయంలో యామునులు తమ శిష్యుడైన తిరుక్కచ్చినంబిని (కాంచీపూర్ణులు) చూచి, "వీరిలో శ్రీరామానుజుల ఎవరు?" అని ప్రశ్నించినపుడు, తిరుక్కచ్చినంబి **"ఆయాతాశ్చ సువృత్తాశ్చ బాహవః"** అనే రీతిలో ఆజానుబాహువై, మధ్యలో వచ్చే వ్యక్తే శ్రీరామానుజులు" అని చూపించారు. ధనుర్దాసు అనే శ్రీరామానుజుల శిష్యుడు కూడా శ్రీరామానుజుల నేత్ర సౌందర్యాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. ఇటువంటి సందర్భాలన్నీ వీరి స్ఫురద్రూపాన్ని వెల్లడి చేస్తున్నవి.

## విలక్షణప్రతిభ

యాదవప్రకాశుల దగ్గర వేదాంతశాస్త్రాధ్యయనాన్ని చేసేటపుడు యాదవప్రకాశులు కొన్ని ఉపనిషద్వాక్యాలకు చెప్పే అర్థాలను, సమన్వయాలను శ్రీరామానుజులు నిశితంగా

గమనించేవారు. కొన్ని సమయాలలో యాదవప్రకాశుల వివరణలు సమంజసంగా తోచనపుడు తమబుద్ధికి యుక్తంగా స్ఫురించిన వివరణలను తెలిపేవారు. యాదవప్రకాశులు వాటిని అంగీకరించేవారు కాదు. అంతకు మించి కొన్ని సమయాలలో శ్రీరామానుజులపై కోపపడేవారు కూడా. ఒకసారి ఛాందోగ్యోపనిషత్తులో – ఆదిత్యమండలాంతర్వర్తి అయిన పరమాత్మరూపాన్ని వర్ణించే ఘట్టంలో గల **"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే తస్య కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** అనే వాక్యం ప్రస్తావనకు వచ్చింది. యాదవప్రకాశులు ఈ శ్రుతి వాక్యంలోని **"కప్యాస"** శబ్దానికి "కోతిపిర్ర" అనే అర్థాన్ని చెప్పి, కోతిపిర్రవలె ఎఱ్ఱనిరంగులో ఉండే తామరపూల వంటి కన్నులను కలవాడు, పరమాత్మ – అనే తగని అర్థాన్ని చెప్పారు. ఈ వివరణను వినగానే శ్రీరామానుజుల కంటి నుండి శోకాశ్రువులు చిందాయి. **'కప్యాస'** శబ్దానికి అంత కంటే యుక్తమైన, సరసమైన అర్థాన్ని శ్రీరామానుజులు **"గంభీరాంభః సముద్భూత – సుమృష్టనాళ- రవికరవికసిత"** అనే మూడుఅర్థాలను తెలిపారు. ఈ మూడు అర్థాల భావమేమంటే- భగవానుని నేత్రాలు–నిండు నీటిలో పుట్టిన, బలమైనకాడను కల, సూర్యునిచే వికసింపజేయబడిన తామరపూల వంటివి – అని.

శ్రీరామానుజుల ఐదుగురుఆచార్యులలో మాలాధరులు (తిరుమాలైయాండాన్) ఒకరు. వీరివద్ద నుండి శ్రీరామానుజులు నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళి ప్రబంధంలోని అర్థాలను ఆలకించారు. కొన్ని సందర్భాలలో మాలాధరులు తెలిపే అర్థాలకంటే మిన్న అయిన, సందర్భోచితమైన అర్థాలను శ్రీరామానుజులు తమ ప్రతిభలో సమన్వయించి తెలియజేసేవారు. ఇటువంటి సంఘటనలు వీరి ప్రతిభావిశేషానికి తార్కాణాలు.

## ఉత్తమ శిష్యలక్షణం

ఆచార్యుడు ఎంతటి కఠినమైన పరీక్ష పెట్టినా, దానికి నిలువగల్గడం ఉత్తమశిష్యలక్షణం. గోష్ఠీపురం (తిరుక్కోట్టియూర్) అనే ఊరిలో ఉండే గోష్ఠీపూర్ణుల (తిరుక్కోట్టియూర్‌నంబి) వద్ద శ్రీకృష్ణచరమ శ్లోకం (**'సర్వధర్మాన్ పరిత్యజ్య'** అనే గీతాశ్లోకం) లోని అపూర్వమైన అర్థాలు నిక్షిప్తమై ఉన్నవి- అని మహాపూర్ణులనే (పెరియనంబి- అనే) తమ ఆచార్యుల ద్వారా విని, వానిని గ్రహించడం కోసంగా తిరుక్కోట్టియూర్‌కు వెళ్లారు.

కాని, నంబి **"ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన, నాచాశుశ్రూషవే వాచ్యమ్"** అనే రీతిలో యోగ్యత లేని వారికి అవి ఉపదేశించ కూడదని తలచి, "ఈసారి కాదు, మళ్లీ రండి" అని పదునెనిమిదిపర్యాయాలు శ్రీరామానుజులను శ్రీరంగంనుండి తిరుక్కోట్టియూర్‌కు వచ్చేటట్లు చేశారు. శ్రీరామానుజులు ఏమాత్రం విసుగుచెందకుండా ఇన్నిసార్లు తిరుక్కోట్టియూర్‌కు వచ్చి, చివరకు నంబికి విశ్వాసానికి కల్గించి, వారి ద్వారా చరమశ్లోకార్థాలను గ్రహించారు. ఇది శ్రీరామానుజుల ఉత్తమ శిష్యలక్షణానికి ఒక సంకేతం.

## ఉత్తమాచార్యలక్షణం

తాను నేర్చిన విద్యను పూర్తిగా, ఏమాత్రం దాచకుండా, శిష్యులకు ఉపదేశించడం ఉత్తమాచార్యలక్షణం. తిరుక్కోట్టియూర్‌నంబి చరమశ్లోకార్థాలను శ్రీరామానుజులకు ఉపదేశించేటపుడు, యోగ్యతను పరీక్ష చేయకుండా వాటిని ఎవ్వరికీ చెప్పవద్దని శ్రీరామానుజుల దగ్గర ప్రమాణం చేయించుకొన్నారు. కాని, శ్రీరామానుజులు, తమకు అంతరంగశిష్యులు కూరేశులు, దాశరథి – అని ఇద్దరున్నారని, వారికి ఈ అర్థాలను తెలుపకుండా తాను ఉండలేనని, అందుకు అనుజ్ఞ ఇవ్వవలసినదని ప్రార్థించి, వారి సమ్మతిని పొందారు.

శ్రీరామానుజుల శిష్యబృందంలో కిడాంబి ఆచ్చాన్ (ఆత్రేయరామానుజాచార్యులు) ఒకరు. ఒక పర్యాయం శ్రీరామానుజులమఠంలో భాగవత సమారాధన జరిగేటపుడు, ఆచ్చాన్, తాగే నీటిని అందరికి



అందిస్తున్నారు. అపుడు ఆచ్చాన్ ఒక భక్తునకు అశ్రద్ధగా జలాన్ని పోయడం గమనించిన శ్రీరామానుజులు, ఆచ్చాన్ దగ్గరకు వెళ్ళి, త్రిదండంతో వారి వీపుపై మెల్లగా తట్టి, నీటిని శ్రద్ధగా అందివ్వమని అన్నారు. ఈ విధంగా **"స్ఖలితే శాసితారమ్"**– పొరబాటు పడినపుడు సరిచేయడం – అనేది ఆచార్య లక్షణం. ఇటువంటి పలు సందర్భాలు శ్రీరామానుజుల ఉత్తమాచార్యత్వానికి గుర్తులు.

## ఔదార్యం

తిరుక్కోట్టియూర్‌నంబిద్వారా గ్రహించిన అపూర్వార్థాలను శ్రీరామానుజులు ఆశను కలవారికి అందరికి ఉపదేశించాలనే ఉదారమైన భావంతో వాటిని, ఆ ఊరిలో గల సౌమ్యనారాయణస్వామి ఆలయంలో ఆసక్తిని కలవారిని అందరిని ఆహ్వానించి, వారికి ఆ అర్థాలను ఉపదేశించారు. ఈ సంగతి నంబికి తెలిసింది. తమకు ఇచ్చిన మాటను మీరి, ఈ విధంగా ఏ పరీక్ష చేయకుండా, అందరికి చరమ శ్లోకాలను ఉపదేశించినందున శ్రీరామానుజులపై తీవ్రమైన కోపం కల్గింది. వారిని పిలిచి, "రామానుజా! ఈ విధంగా ఎందుకు వర్తించారు? గురువుకు ఇచ్చిన మాటను మీరితే కలిగే ఫలం ఏమో తెలియదా?" అని ప్రశ్నించారు. శ్రీ రామానుజులపుడు తాము వారికిచ్చిన మాటను కాదని వర్తించిన సంగతి నిజమేనని, దాని ఫలం నరకప్రాప్తియే నని తెలిపి, తాము ఒక్కరు నరకానికి పోయినా, అపూర్వార్థాలను గ్రహించినందున ఇంతమంది సద్గతిని పొందుతారనే భావంతో ఆ విధంగా చేశానని బదులిచ్చారు. పరసమృద్ధిని ప్రధానంగా తలచే శ్రీరామానుజుల ఉదారాశయాన్ని గుర్తించి, ఆశ్చర్యానందాలలో మునిగిన తిరుక్కోట్టియూర్ నంబి వారిని **"ఎమ్‌పెరుమానారే!"** (మాకు స్వామీ– మాకంటే గొప్పవాడా!) అని సంబోధించారు. తరువాతి కాలంలో 'ఎమ్బెరుమానార్' అనే ఈ పేరు శ్రీరామానుజులకు సంప్రదాయంలో ప్రసిద్ధమైనది.

## సమతాభావం

కర్ణాటకలోని శ్రీవైష్ణవక్షేత్రం మేల్కోట. ఇక్కడ విరాజిల్లే అర్చామూర్తి చిరకాలం మరుగుపడిపోయింది. ఆ విషయాన్ని శ్రీరామానుజులు, భగవానుడు స్వప్నంలో సాక్షాత్కరించి పల్కిన మాటవల్ల గ్రహించారు. మేల్కోటప్రాంతాన్ని పాలించే విష్ణువర్ధనుని సహాయసహకారాలతో ఆ మూర్తిని వెదకి కనుగొని, ఆలయంలో ప్రతిష్ఠించారు. ఈ కృషిలో తమకు సహకరించిన వారు ఆలయప్రవేశార్హత లేనివారుగా పరిగణింపబడే ఒక తెగ వారిపట్ల కృతజ్ఞతను వ్యక్తీకరిస్తూ, వారికి సంవత్సరంలో ఒక నాడు ఆలయంలో ప్రవేశించి, స్వామిని దర్శించుకొనే అవకాశాన్ని కల్గించారు.

కాంచీపూర్ణులనే యామునుల శిష్యులు బ్రాహ్మణేతరణ కులానికి చెందినవారు. వారి శుద్ధమైన జ్ఞానాన్ని, అనుష్ఠానాన్ని గుర్తించిన శ్రీరామానుజులు వారిని ఆచార్యులుగా ఆశ్రయించాలని తలచి, తమ అభిప్రాయాన్ని కాంచీపూర్ణులకు తెలిపారు. కాని, ఆకాలంలో సమాజంలోని కట్టుబాటును ఆదరించిన నంబి శ్రీరామానుజుల మాటను సున్నితంగా తిరస్కరించారు. కాంచీపూర్ణులు భుజించగా మిగిలిన ప్రసాదాన్ని స్వీకరించాలని కూడా శ్రీరామానుజులు యత్నించారు. (కాని, ఆ ప్రయత్నం సఫలం కాకపోవడం వేరే సంగతి.) ప్రతిదినం కావేరీనదిలో స్నానంచేసి తిరిగి వచ్చేటపుడు శ్రీరామానుజులు ధనుర్దాసుచేతిని ఆలంబనంగా చేసికొని తిరిగి వచ్చేవారట. ఈ విషయాలన్నీ శ్రీరామానుజుల సమతాభావానికి చిహ్నికలు.

## వాదపటిమ



శాస్త్రాలను అధ్యయనం చేయడం వేఱు, ప్రతివాదులతో వాదించేటపుడు సమయస్ఫూర్తితో వాటిలోని అంశాలను, యుక్తులను, అనుకూలతర్కాలను ప్రయోగించి వాదించడం వేరు. ఈ సామర్థ్యం శ్రీరామానుజులకు మెండుగా ఉండేది. తిరుమలలో అర్చామూర్తి శ్రీవేంకటేశ్వరుడు శ్రీరామానుజులకాలంలో శంఖచక్రహస్తుడై ఉండేవాడు కాదు. తొండమాన్ చక్రవర్తి అనే భక్తునకు సహాయంగా తనచేతిలోని శంఖచక్రాలను అనుగ్రహించిన స్వామి, దానికి గుర్తుగా అప్పటినుండి తన హస్తాలలో శంఖచక్రాలను ధరించలేదు. ఈ కారణంచేత తిరుమలలోని మూర్తి ఎవరు? అనే విషయంలో అభిప్రాయ భేదాలు ఏర్పడ్డాయి. వీటిని పరిష్కరించి, యథార్థనిర్ణయం చేయడం కోసం తిరుమలప్రాంతాన్ని పాలించే యాదవరాజు శ్రీరామానుజులను తిరుపతికి ఆహ్వానించాడు. అపుడు శ్రీరామానుజులు తిరుపతికి వచ్చి, వేద, పురాణ, ఆగమశాస్త్రాల నుండి, ఆళ్వార్ల ప్రబంధాల నుండి పలు ప్రమాణాలను ఉట్టంకించి, తిరుమలలోని మూర్తి శ్రీమన్నారాయణుడేనని నిరూపించారు.

ఈ వాదప్రతివాదాలన్నిటిని శ్రీరామానుజుల శిష్యులైన అనంతార్యులు **"శ్రీవేంకటాచలేతిహాసమాల"** అనే గొప్ప సంస్కృత గ్రంథంలో కూర్చారు.

## ఆలయనిర్వహణ సామర్థ్యం

శ్రీరంగంలోని శ్రీరంగనాథస్వామి ఆలయం కైంకర్య నిర్వహణలో శ్రీరామానుజుల కాలానికి ముందు పలు లోపాలు చోటు చేసికొన్నాయి. అప్పుడు శ్రీరంగాల యాధిపత్యం శ్రీరంగామృతకవి (తిరువరంగత్తముదనార్) అనే ఆచార్యుల అధీనంలో ఉండేది. తమ శిష్యుడైన కూరేశులద్వారా ఆ అధికారాన్ని చాతుర్యంతో సంపాదించిన శ్రీరామానుజులు ఆ ఆలయనిర్వహణలో పలు సంస్కరణలను చేశారు. ఆ విధంగానే తిరుమల ఆలయంలో కూడా పలు ఆచార వ్యవహారాలను, కట్టుబాట్లను సంస్కరించి సరిచేశాడు.

మేల్కోటై ఆలయంలో కూడా 52 మంది శ్రీవైష్ణవ కుటుంబాలను ద్రావిడ దివ్యక్షేత్రాలనుండి రప్పించి, వారిని ఆయా సేవలలో నియమించారు. ఇప్పటికీ అక్కడ ఆ వ్యవస్థ కొనసాగడం విశేషం. సింహాచలం, శ్రీకూర్మం, అహోబిలం మొదలైన పలుక్షేత్రాలలో సైతం ఆవశ్యక సంస్కరణలను చేశారు. ఇవి అన్నీ శ్రీరామానుజుల ఆలయ నిర్వహణతంత్రంలోని గాఢమైన అవగాహనను తెల్పుతున్నాయి.

## దీర్ఘదర్శిత్వం

శ్రీరామానుజులు తిరుమల ఆలయంలో పలుసమయాచారాలను సంస్కరించి, వ్యవస్థను సుస్థిరం చేసిన తరువాత, వాటి నిర్వహణ బాధ్యతను తమ శిష్యులైన అనంతార్యులకు అప్పగించి, శ్రీరంగానికి వెళ్ళిపోయారు. కొంత కాలానికి అనంతార్యులు వృద్ధులైనందున, ఆ బాధ్యత కోసం అనంతార్యుల శిష్యులైన విష్వక్సేనైకాంగి అనే బ్రహ్మచారిని నియమించారు. ఆలయ కైంకర్యం (సేవ) ఉత్తమాశ్రమి (సన్న్యాసి) నిర్వహించడం యుక్తమని, గృహస్థుడుకాని, బ్రహ్మచారికాని నిర్వహిస్తే కొన్ని ఇబ్బందులు తప్పవని గ్రహించి, భవిష్యత్తులో తిరుమల ఆలయవ్యవస్థను స్థిరంగా కొనసాగాలని భావించి, ఆ విష్వక్సేనైకాంగికి సన్న్యాసాశ్రమాన్ని ఇప్పించి, శ్రీవేంకటనాథశఠకోపయతి-అనే పేరును పెట్టి,వారికి ఆలయ కైంకర్య బాధ్యతను అప్పగించారు. శ్రీవైష్ణవ సన్న్యాసికి తమిళంలో "జీయర్" అని పేరు. మొదట ఒక జీయర్‌ను మాత్రమే నియమించినా, తర్వాత ఆ జీయర్‌కు ఉత్తరాధికారి అయిన ఇంకొక జీయర్‌ను (చిన్నజీయర్‌ను) కూడా నియమించారు. తర్వాత ఈ విధమైన జీయర్ వ్యవస్థ శ్రీరంగంలో, తిరునారాయణపురం(మేల్కోటై)లో, కంచిలో కూడా ఏర్పడి ఈ వ్యవస్థ ఈనాటికీ ఈ క్షేత్రాలలో కొనసాగడం, జీయర్ పర్యవేక్షణలో ఆ ఆలయాల సమయాచారాలు నిర్వహింపబడడం గమనించవచ్చు. ఇది అంతా శ్రీరామానుజుల దీర్ఘదర్శిత్వానికి సాక్షి.



## కవితాచాతుర్యం

శ్రీరామానుజులు గొప్ప దార్శనికులే కాక, గొప్ప కవులు కూడా. గీతాభాష్యంలో, శ్రీభాష్యంలో, వేదార్థ సంగ్రహంలో పలుచోట్లగల శ్రీరామానుజులసూక్తులు దీనిని ఋజువు చేస్తున్నాయి. ఉదాహరణగా ఒక్క సందర్భం మాత్రం ప్రస్తావింపబడుతున్నది. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునుని ఉద్దేశించి **"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు"** అని ఉపదేశించాడు. ఈ సూక్తిలోని **"మన్మనాభవ"** అనే ప్రయోగాన్ని శ్రీరామానుజుల **"మయి సర్వేశ్వరే నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతానే సర్వజ్ఞే సత్య సంకల్పే....... అపారకారుణ్యసౌశీల్య సౌందర్యమాధుర్యగాంభీర్యౌదార్యవాత్సల్యజలధౌ,.... సర్వస్వామిని తైలధారా పదవిచ్ఛేదేన నివిష్టమనా భవ"** అని వ్యాఖ్యానించడంలోని భావుకత, ఈ వివరణలోని కవితామాధుర్యం సహృదయ హృదయ సంవేద్యం. ఇటువంటి సందర్భాలు ఇంకా చాలా ఉన్నాయి. ఇవి అన్నీ శ్రీరామానుజుల కవిత్వానికి గుర్తులు.

## నగరనిర్మాణకౌశలం

శ్రీరామానుజుల తిరుపతి నగరంలో గోవిందరాజస్వామిని ప్రతిష్ఠించిన తర్వాత, ఆ ఆలయం ఉత్తరోత్తరాభివృద్ధిని కాంక్షిస్తూ, గోవిందరాజస్వామికి దక్షిణ దిక్కులో గోదాదేవిని


శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయం, తిరుపతి

ప్రతిష్ఠించారు. ఆ ఆలయం చుట్టూ నాల్గు విశాలమైన వీథులను ఏర్పరచి, ఆ నాల్గువీథులలో ఆలయం పరివారానికి నివాసా లను ఏర్పాటు చేశారు. ఏయే దిక్కులలో ఎవరెవరు నివసిం చాలో, ధాన్యాగారం ఏ దిశలో ఉండాలో - ఇటువంటి అంశా లను గమనించి వ్యవస్థీకరించారు. ఇది అంతా శ్రీరామానుజుల నగరనిర్మాణతంత్రం (టౌన్ ప్లానింగ్ టెక్నిక్) పట్ల అవగాహనను వ్యక్తం చేస్తున్నది.

### వ్యాఖ్యాన రచనానైపుణ్యం

శ్రీరామానుజులు బాదరాయణ ప్రణీతాలైన బ్రహ్మ సూత్రాలకు విశిష్టాద్వైతపరంగా భాష్యాన్ని రచించి, దానిని కాశ్మీరదేశంలోని శారదాపీఠంపై సమర్పించారు. శారదాదేవి ఆ వ్యాఖ్యను శిరసావహించి, "భాష్య మంటే మీదే భాష్యం. మీరే భాష్యకారులు. ఇకపై మీ భాష్యం శ్రీభాష్యమనే పేరులో వ్యవహరింపబడుతుంది."అని అంటూ ప్రశంసించి, హయ గ్రీవుల అర్చామూర్తిని శ్రీరామానుజులవారికి బహూకరించింది.

ఇతర సంప్రదాయానికి చెందిన విద్వాంసులు సైతం శ్రీరామానుజుల శ్రీభాష్యరచనలో మాధుర్యాన్ని మెచ్చుకొని "శ్రీవైష్ణవకాదంబరి" అనే పేరుతో ప్రశంసించడం శ్రీభాష్య మహిమను వ్యక్తం చేస్తున్నది.

### ద్రావిడభాషా ప్రావీణ్యం

శ్రీరామానుజులకు ద్రావిడభాషలో పాండిత్యం లేదని, అందువల్లనే వారు తమ గ్రంథాలను సంస్కృతంలో మాత్రమే రచించారని, ద్రావిడగ్రంథాన్ని దేనినీ రచించలేదని కొందరి వాదన. కాని, ఆళ్వార్ల ప్రబంధాలకు వ్యాఖ్యానాలను రచించిన శ్రీవైష్ణవగురుపరంపరలోని పలువురు పూర్వాచార్యులచే తమ వ్యాఖ్యలలో నూటికిపైగా గల సందర్భా లలో శ్రీరామానుజుల ఆయా ఆళ్వార్ల పాశురాలను విలక్షణమైన రీతిలో అన్వయించి, అపూర్వమైన అర్థా లను తెల్పిన వైనాలు ప్రస్తావింప బడడం ప్రత్యక్షంగా దర్శించ వచ్చు. ఇవి అన్నీ శ్రీరామాను జుల ద్రావిడ భాషాపాండిత్యా నికి, సందర్భోచిత సమ న్వయ సామర్థ్యానికి చిహ్నాలు.



### భక్తిపారవశ్యం

ఒకనాడు శ్రీరామానుజులు భిక్షకోసం శ్రీరంగంలో తిరువీథులలో సంచరిస్తూ గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధాన్ని అనుసంధిస్తున్నారు. క్రమంగా మహాపూర్ణులు (పెరియనంబి) ఇంటి ముందు నిలిచారు. అప్పటికి శ్రీరామా నుజులు తిరుప్పావైలోని 18వ పాశురాన్ని అనుసంధిస్తూ, ఆ పాశురం చివరలో గల "శెన్దామ రైక్కైయాల్ శీరార్ వళై ఒలిప్ప వన్దు తిఱవాయ్" (ఓ నీలాదేవీ! అందమైన తామరపూవు వంటి నీ చేతితో అందమైనగాజులు గలగలలాడగా వచ్చి నీవు తలుపు తీయాలి) అనే సూక్తిని అనుసంధిస్తున్నారు. అదే సమయంలో పెరియనంబిగారి కుమార్తె గాజుల శబ్దంచేస్తూ భిక్షపెట్టడం కోసం తలుపుతీసింది. ఆ దృశ్యాన్ని చూచి సాక్షాత్తుగా నీళాదేవే ప్రత్యక్షమైనదనే భక్తిపారవశ్యంతో శ్రీరామానుజులు మూర్ఛి ల్లారు.

ఈ విధంగా శ్రీరామానుజుల జీవితాన్ని పలు దృక్కో ణాలలో పరిశీలిస్తే ఎన్నో విశేషాలు గోచరిస్తాయి.

శేషో వా సైన్యనాథో వా శ్రీపతిర్వేతి సాత్త్వికైః ।
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్ ॥

ఆదిశేషులా? విష్వక్సేనులా? లేక, శ్రీమన్నారాయ ణుడా, వీరు! - అని గొప్ప బుద్ధిమంతులైన సత్పురుషులచే ఉల్లేఖింపబడే భాష్యకారులకు మంగళం.



# శేషాద్రీశుని సేవలో...

# శేషాంశ సంభూతుడు!!

- శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం,
99856 70152

'శ్రీవైకుంఠం' పేరును అందరు వినే ఉంటారు. అది ఒక అంతులేని పాలకడలి! ఆ సముద్రం లోని అలలమీద వేయి పడగల ఆదిశేషుడు చుట్ట చుట్టుకొని తెప్పలాగా తేలుతూ ఉంటాడు. ఆ శేషునిపై శ్రీమహావిష్ణువు పడుకొని ఉంటాడు. ఆయనను శ్రీదేవి భూదేవేరులు సేవిస్తుం టారు. ఎదురుగా ఆ స్వామి ఆజ్ఞాపాలన కోసం గరుడ భగవానుడు సర్వసన్నద్ధమై నిలిచి ఉంటాడు. సనందాదియోగులు, సప్తర్షులు, దేవతలు మాత్రం వెళ్లి దర్శించేవాళ్లు. ఆ లోకం అనంతమైన 'ఆధ్యాత్మిక ఆనందధామం' అచటికి వెళ్లగలిగిన వాళ్లు మాత్రమే ఆ పరమా నందాన్ని మనసారాజుర్రుకోవచ్చు అంతే!

బాగుంది!

కాని ఆ శ్రీవైకుంఠం ఎక్కడుందో, ఏ దిక్కులో వెళ్లాలో, ఎంత దూరం వెళ్లాలో, ఎలా వెళ్లాలో ఎవరికీ తెలియదు. అక్కడికి ప్రత్యక్షంగా వెళ్లివచ్చినా వాండ్లెవ్వరూ మనకు తారస పడనే పడరు. అందులోను ఈ కలియుగంలో మరీ విచిత్రం!

అందుకే ఆ లోకానికి రాలేని కలియుగ మానవులకోసం ఆ ఫణీంద్రశాయి వైకుంఠంతో పాటు భూలోకానికి వచ్చాడు. ఆ శేషతల్పమే ఇక్కడ 'శేషాద్రి' అయ్యింది. ఆ శ్రీహరే శేషాద్రీశుడ య్యాడు. ఇలాగ ఆయన కొలువై ఉన్న తిరుమల క్షేత్రం భూలోక వైకుంఠంగా భాసిల్లింది. భాసిల్లుతునే వుంది.

అందుకనే తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా అన్నాడు.

అదివో అల్లదివో! హరివాసము పదివేల శేషుల పడగల మయము

కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ! తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ!!

వైకుంఠవాసుడైన శ్రీహరితో పాటు, ఆ వేయిపడగలస్వామి కూడ ప్రతియుగంలోను అవ తరించి సేవిస్తుంటాడు.

అనంతః ప్రథమం రూపం, లక్ష్మణస్తు తతః పరమ్।
బలభద్రః తృతీయ స్స్యాత్, కలౌ రామానుజ స్మృతః॥

మొదట వైకుంఠంలో అనంతుడైన ఆదిశేషుడుగాను, రెండవమారు లక్ష్మణుని గాను, మూడవమారు బలరామునిగాను, కలి యుగంలో భగవద్రామానుజులుగా అవతరిం చాడు!

సాక్షాత్తు శేషాంశతో అవతరించిన భగవద్రామానుజాచార్యులవారు తమ నూట ఇరవైఏండ్ల(1017-1137) సుదీర్ఘజీవితంలో వారు చేసిన అనేకానేకమైన అద్భుతమైన కార్యాల్లో ఘనకార్యాల్లో ప్రధానంగా రెండిం టిని పేర్కొనవచ్చు.

శ్రీమద్రామానుజులవారు ప్రాచీనమైన శ్రీవైష్ణవమతాన్ని సముద్ధరించడంతోపాటు, సమాజంలో అగ్రకులాల స్థాయి నుండి సంఘం చేత వెలివేయబడి అట్టడుగున ఉన్న నిమ్నకులాలవారికి శ్రీవైష్ణవమత స్వీకార అర్హతను కల్గించడం మొదటి అద్భుతకార్యం.

సనాతన వైదిక సంస్కృతినీ, హైందవ ధర్మాన్నీ పరిపుష్టం చెయ్యడానికి ఆసేతు హిమాచలం పర్యటించాడు. అందులో



భాగంగా, శ్రీవైష్ణవ సిద్ధాంతానుసారంగా వ్యాఖ్యాన గ్రంథాలను రచించారు. దానితో పాటు ఎన్నో వైష్ణవ ఆలయాలను శ్రీవైష్ణవ క్షేత్రాలను అభివృద్ధి చేశారు. ఆ యా క్షేత్రాల్లో, ఆలయాల్లో అస్తవ్యస్తంగా, అసమగ్రంగా ఉన్న పూజలను, ఉత్సవాలను, ఆగమశాస్త్రాల నియమానుసారం సంప్రదాయబద్ధంగా తీర్చిదిద్ది వాటిని నిర్వహింపజేయడం రామానుజులు నిర్వహించిన రెండవ ఘనకార్యంగా పేర్కొనవచ్చు.

అలాగ వారు సముద్ధరించి, అర్చనాది కార్యక్రమాలను, ఉత్సవాలను పటిష్ఠంగా ఏర్పరచిన శ్రీవైష్ణవ క్షేత్రాల్లో ప్రప్రథమంగా పేర్కొనదగింది వేంకటాచల క్షేత్రం.

శేషాచలక్షేత్రానికీ శేషాంశంతో అవతరించిన రామానుజులవారికీ విడదీయరాని విడదీయలేని దివ్యఅనుబంధం పెనవేసుకుంది.

## తిరుమల కొండే దేవుడు

తిరుమలకొండ సాక్షాత్తూ 'శ్రీనివాస పరబ్రహ్మ' అనీ ఆళ్వార్లందరూ కీర్తించారు. వాళ్లలో కొందరు తిరుపతికి వచ్చినా, కొండక్రింది నుంచే నమస్కరించారు. వాళ్ల అభిప్రాయాన్ని భగవద్రామానుజులు కూడా అనుసరించి కొండకు పాదాలతో తొక్కుతూ వెళ్లకూడదని నిశ్చయించారు. కాని రామానుజులవారి గురువు తిరుమలనంబీ, శిష్యుడైన అనంతాళ్వారు, శ్రీవారిఆలయంలో జరిగే అర్చనాదులను తీర్చదిద్దవలసి ఉందన్న అభ్యర్థన మేరకు భగవద్రామానుజులవారు మూడుమారులు మాత్రం తిరుమలకొండకు వెళ్లారు. అది కూడ మోకాళ్లతో పాకుతూ కఠోరదీక్షతో మాత్రమే కొండకు వెళ్లారు.

ఆళ్వారుల నాటి నుండి తిరుమల కొండే సాక్షాత్తూ శ్రీనివాసుడనీ, అందువల్ల ఆ కొండను పాదాలతో తొక్కుతూ తిరుమలకు వెళ్లకూడదని శ్రీరామానుజుల వారు నిశ్చయించారు.

కానీ, ఆ క్షేత్రంలో శ్రీనివాసుని పూజాకార్యక్రమాలు సక్రమంగా నిర్వహింపబడేటట్లుగా చూడడానికై, తప్పక తిరుమలకు రావలసిందన్న తిరుమలనంబి, అనంతాళ్వారుల అభ్యర్థనను అంగీకరించారు రామానుజుల వారు. **అందుకే వారు మూడు మారులు మాత్రం మోకాళ్లతో దేకుతూ తిరుమల కొండకు వెళ్లారు.**

## త్రోవ భాష్యకారులు

**భగవద్రామానుజులవారు శ్రీభాష్య గ్రంథాలను వెలయించినందువల్ల వారు భాష్యకారులుగా ప్రసిద్ధిని పొందారు. వారు తమ తిరుమలయాత్రలో మూడుమారులు పాదాలతో కొండమెట్లను తొక్కకుండా మోకాళ్లతో మాత్రమే దేకుతూ, కొండకు వెళ్లారు. అలా వెళుతున్న సమయంలో 'మోకాళ్ల మెట్టు' దగ్గర కొద్దిసేపు వారు విశ్రాంతి తీసుకొన్నారు.**

**అందుకు గుర్తుగా ఆ తరువాతి కాలంలో ఆ దివ్య స్థలంలో రామానుజులవారి విగ్రహం ప్రతిష్ఠింపబడింది. వారినే "త్రోవభాష్యకారులు" అని అంటారు. త్రోవభాష్యకారులకు ప్రతిరోజు తిరుమల శ్రీవారి ఆలయం నుండి నివేదనలు తెచ్చి ఆరగింపులు చేయబడుతున్నవి.**



## శేషాద్రీశుని సేవలో.. శేషాంశ సంభూతుడు!!

తిరుమల క్షేత్రం, ఐతిహ్యం ప్రకారం, ఆదివరాహక్షేత్రం అనీ, తొలిదైవమైన శ్రీవరాహస్వామికి నిత్యం తొలిపూజ, తొలి నివేదన, తొలి దర్శనాదుల కట్టడిని భగవద్రామానుజులవారు పునరుద్ధరించారు. తామూ తొలిగా శ్రీవరాహస్వామిని దర్శించారు.

తిరుమల క్షేత్రంలో శ్రీవైకుంఠనాథుడైన శ్రీనివాసుడే సాలగ్రామ శిలామూర్తిగా వెలిశాడనీ, ఆ స్వామే మళ్లీ విఖనస మహర్షిగా అవతరించి, తన అర్చనా విధానాన్ని ఏర్పాటు చేసుకున్నాడనీ, అందువల్ల తిరుమల క్షేత్రంలో ఏ మాత్రం లోపం లేకుండా,

## పెరుగమ్మే పడతికి పరమపదం!

ఇది విన్నారా!

శ్రీరామానుజులవారు తిరుమలలో పెరుగును అమ్మే గొల్ల స్త్రీకి ముక్తిని ఇప్పించాడట! విడ్డూరంగా ఉంది కదూ! ఏంటో ఆ కథా కమామీషు?

పూర్వం తిరుమలేశునికి కొన్ని ఉత్సవాలు తిరుచానూరుల్లో జరిగేవట!

తిరుమలేశునికి ఉత్సవాలు అన్నీ పూర్తిగా కొండపైనే జరగాలనీ, అందుకోసం శ్రీవారి ఆలయం చుట్టూరా వీథుల్ని చదును చేసి, వెడల్పు చెయ్యడం, మండపాలు కట్టించడం, అర్చకుల ఇండ్లను నిర్మించడం, శ్రీవైష్ణవ మఠాల్ని కట్టించడంవంటి పనుల్ని తీర్మానించారట శ్రీరామానుజులవారు. తమకు గురువైన తిరుమల నంబిని, శిష్యుడైన అనంతాళ్వారులను వీటి నిర్మాణాన్ని పర్యవేక్షించమని వారు ఆదేశించారు.

ఆ సమయంలో ఆ యా పనుల్లో నిమగ్నమైన కూలీలకు, పర్యవేక్షిస్తున్న వైష్ణవస్వాములకు మాత్రం ఉచితంగా 'మజ్జిగ' ను ఇచ్చేదట ఒక గోపవనిత. మిగిలిన యాత్రికులకు మాత్రం పెరుగును, మజ్జిగను అమ్ముతుండేది.

అమాయకంగా, నిష్కల్మషంగా ఉండే గొల్ల వనితను ఉచితంగా పెరుగు, మజ్జిగను ఇవ్వడంలో నీ అభిప్రాయం ఏమిటి? అని కొందరు అడిగారు.

ఆమె అన్నది గదా! "అయ్యా! ఎండలో కష్ట పడుతున్న సాములోర్లకు 'చల్ల'ను ఇస్తే నేను చల్లగా ఉంటాను. పుణ్ణెం వత్తదంట! స్వామిని చేరుకుంటానంట!" అని.

వాళ్లన్నారు, "బాగుంది తల్లీ! నీవు మోక్షం ఇప్పించమని వాళ్లను అడుగు" అని తిరుమల నంబిని, అనంతాళ్వానులను చూపించారట! వాళ్లు.

వెంటనే ఆ గోపవనిత "సాములూ! మీతో గోయిందస్వామి మాట్లాడతాడంట గదా! మీరు చెప్తే నాకు వైకుంఠం వత్తదంట. ఇప్పించండి సామీ!" అని అడిగింది.




"రేపు చెపుతాం తల్లీ!" అంటూ ఇద్దరూ దాటవేశారు. ఆ రాత్రి చల్లలమ్మే గొల్లస్త్రీ కోరికను ఏడుకొండల స్వామికి విన్నించారు.

ఆమెకు వైకుంఠం ఇచ్చే శక్తీ మీకే కాదు, నాకు కూడా లేదు. రామానుజులు మాత్రమే ఇప్పించగలరని శ్రీనివాసుడు వాళ్లతో పలికాడట!

ఆ విషయం ఆమెకు తెలిపారు వాళ్లిద్దరూ. సరిగ్గా ఆ దినాల్లోనే రామానుజస్వామి తిరుమలకొండకు చేరుకొన్నారట!

ఎంతో భక్తిగా, ప్రేమగా, నిష్కల్మషంగా ఆమె చేస్తున్న మజ్జిగ వితరణను రామానుజులవారు వినడమే కాదు. స్వయంగా గమనించారు.

ఒకరోజు ఆ వనిత ఒదిగి ఒదిగి భగద్రామానుజుల వారికి రెండు చేతులెత్తి దండాలు పెడుతూ సాగిలబడింది. "సాములూ! కొంచం చల్ల తీసుకోండి స్వామీ!" అంటూ, భయం భయంగా అడిగింది. కొందరు ఆమెను వారించ బోయారు.

రామానుజులవారు "తల్లీ! ఇది శ్రీనివాస ప్రసాదం అంటూ స్వయంగా చల్లను తాగుతూ, నీకు ఏం కావాలమ్మా!" అని అడిగారు.

"సాములూ, మీరు చీటి రాసిస్తే, మీరు చెప్తే నాకు వైకుంఠం వత్తాదంట! ఈ జల్మానికి అది ప్పించండి. చాలు సాములూ" అంటూ వంగి దండాలు పెట్టింది.

వెంటనే భగద్రామానుజులవారు ఒక తాటాకును తెప్పించి "శ్రీనివాస పరబ్రహ్మ ముక్తిని ప్రసాదించు గాక!" అంటూ ఆమె చేతిలో పెట్టారట! అంతే!

వెంటనే "పెరుగమ్మే పడతి పరమపదం" పొందింది. శ్రీవారి ఆలయానికి ఎదురుగా ఆమె పేరుతో ఎత్తైన నాలుగు స్తంభాల "గొల్లమండపం" ఆమె గాథకు గుర్తుగా వెలసిందని జనశ్రుతి!



## తొలిపూజ - తొలి నివేదనం - తొలి దర్శనం

శ్రీవేంకటాచల క్షేత్రంలో వెలసిన తొలిదైవం శ్రీశ్వేతవరాహస్వామి. అందువల్లే "ఆదివరాహక్షేత్రం" అనీ, "శ్వేతవరాహక్షేత్రం" అని తిరుమల పేరు పొందింది. శ్రీమహావిష్ణువు శ్వేతవరాహస్వామిగా అవతరించి హిరణ్యాక్షుణ్ణి సంహరించి, భూదేవిని ఉద్ధరించి ఇక్కడే నిలిచాడు.

ఆ తర్వాత కొంతకాలానికి శ్రీనివాసుడు వచ్చి తాను కలియుగాంతం వరకు ఇక్కడ ఉండదానికి నూరు అడుగుల స్థలం దానంగా ఇమ్మని అడిగాడు. అందుకు ఏదైనా ప్రతిఫలంగా ఇవ్వవలసిందని వరాహస్వామి అడిగాడు. కలియుగాంతం వరకు ఈ క్షేత్రంలో తొలిదైవమైన వరాహస్వామికి "తొలిపూజ – తొలి నివేదన – తొలి దర్శనం" జరిగేటట్లుగా పత్రం రాసిచ్చాడు శ్రీనివాసుడు.

రాకుండా వైఖానసఆగమం ప్రకారంగా పూజలు జరిగి తీరాలని గట్టిగా నిర్ణయించారు. అపర శేషావతారుడైన శ్రీరామానుజుల వారు.

పరమభక్తుడైన తొండమానుడు అనే రాజుకు శత్రువుల నుండి రక్షణగా శ్రీవేంకటేశ్వరస్వామి తన శంఖుచక్రాలను ఇచ్చాడు. అతను మళ్లీ తిరిగి ఇవ్వడానికి రాగా, వాటిని ఈ కలియుగంలో ధరించనంటూ స్వీకరించలేదు. అందువల్ల శంఖు చక్రాలు లేని తిరుమలలోని ఈ మూర్తి శివుడా! కుమారస్వామి వారా! శక్తిదేవతా! అని సందేహాలు అనేకమందికి కలిగాయి. వక్షఃస్థలమహాలక్ష్మితో విరాజిల్లుతూవున్న ఈ స్వామివారికి, తన తపశ్శక్తి చేత శంఖుచక్రాలను స్వయంగా స్వామివారే ధరించు నట్లు చేసి సాక్షాత్తు విష్ణువే అని నిరూపించి తిరుమలను శ్రీవైష్ణవ క్షేత్రంగా ప్రతిష్ఠించిన ఘనత శ్రీరామానుజులవారిదే!

## సన్నిధి భాష్యకారులు

సన్నిధి అనగా "తిరుమల శ్రీవారి సన్నిధి" అని అర్థం. తిరుమల శ్రీవారి ఆలయం విమాన ప్రదక్షిణ మార్గంలో "సన్నిధి భాష్యకారులు" అనగా శ్రీరామానుజాచార్యులవారు ప్రతిష్ఠింబడి ఉన్నారు.

శ్రీవారిహుండీకి ఎదురుగా తాళ్లపాక అరకు పక్కగా ముందుకు చొచ్చుకొన్నట్లుగా నిర్మింపబడిన "సన్నిధి భాష్యకారుల" గుడిలో నిరంతరం శ్రీవారి దర్శనానంతరం భక్తులు శ్రీరామానుజులవారిని దర్శించవచ్చు. శ్రీవారికి నివేదనం జరిగిన ప్రతిసారీ శ్రీవారి సన్నిధి భాష్యకారులకు నివేదింపబడుతుంది.

దీనిని 12వ శతాబ్దంలో అనంతాళ్వానులు శ్రీవారి ఆలయంలో ప్రతిష్ఠించారు. చిన్ముద్రతో వేంచేసి ఉన్న అతి చిన్న వయసుగల విగ్రహంగాను, స్వయంగా రామానుజులవారే ఆలింగన చేసుకొని అనంతాళ్వానుకు ఇచ్చిన విగ్రహంగాను "సన్నిధి భాష్యకారులకు" ప్రసిద్ధి ఉంది.



## 'బాగ్ సవారీ' ఉత్సవం

తిరుమలలో పుష్పకైంకర్యం కోసం తోటను పెంచాడు అనంతాళ్వాను. ఆ తోటను చూడడానికి రాత్రిపూట శ్రీనివాసభగవానుడు, లక్ష్మీదేవితోపాటు వచ్చి పాడుచేశాడు. దాన్ని గమనించి రాత్రిపూట కాపుకాచిన అనంతాళ్వాను వారిద్దర్నీ బంధించాడు. కాని స్వామి తప్పించుకొని పోగా, లక్ష్మిని కట్టివేసి, అతనికోసం పరిగెత్తాడు. ఆలయానికి అప్రదక్షిణంగా పరుగెత్తి, పరుగెత్తి చివరకు పూలతోట దగ్గరికే వచ్చి స్వామి అదృశ్యమయ్యాడు. లక్ష్మి మాత్రం చెట్టుకు బంధింపబడి ఉందని సంతోషించాడు.

ఇంతలో తెల్లవారగా వక్షఃస్థలంలో లక్ష్మి కనిపించ లేదని అర్చకులు ఆందోళనపడగా, శ్రీస్వామివారు "అనంతా ళ్వాను ఆమెను పూలతోటలో బంధించాడని, సగౌరవంగా ఇద్దరినీ పిలుచుకొని రమ్మని" చెప్పాడు. వారు ఆలయం చేరుకోగానే, అమ్మవారు అదృశ్యమై శ్రీవారి వక్షఃస్థలం చేరుకొంది.

ఈ గాథను స్మరిస్తూ ప్రతి సంవత్సరం బ్రహ్మోత్సవాల్లో "బాగ్‌సవారి ఉత్సవం" ఏర్పాటు చేశారు రామానుజుల వారు. 'బాగ్' అనగా తోట. తోటకు వెళ్లే ఉత్సవం కనుక ఇది 'బాగ్‌సవారీ' అంటారు. ఆ రోజు శ్రీనివాసుడు దేవేరులతో ఆలయానికి అప్రదక్షిణంగా అనంతాళ్వాను తోటకు వెళ్తారు. ఆ తర్వాత ఆలయం చేరుకొంటారు.

అంత మాత్రమేగాక శ్రీవారి వక్షఃస్థలంలో ఉన్న "వ్యూహలక్ష్మి"ని అందరూ దర్శించడం కుదరదు కనుక, స్వామివారి వక్షఃస్థలంలో ఆభరణంగా అందరికీ కనపడేటట్లుగా "బంగారు లక్ష్మి" ప్రతిమను అలంకరింప జేశారు. ఆనాటి నుంచి నియమబద్ధంగా వక్షఃస్థల లక్ష్మితో కూడి ఉన్న శ్రీని వాసునికి శుక్రవారంనాడు మాత్రమే అభిషేకం జరగాలని నిర్ణయించి అమలు చేయించిన ఘనత రామానుజుల వారిదే!

తిరుమల శ్రీనివాసునికి పుష్పాలంటే చాల ఇష్టం. ఈ క్షేత్రంలోని పూలన్నీ శ్రీవారి పూజకే వినియోగించాలని క్షేత్ర నియమం. అందువల్లే "పుష్పమండపం" గా ప్రసిద్ధిపొందిన తిరుమలలో పుష్పకైంకర్యం కోసం అనంతాళ్వాను అనే శిష్యుణ్ణి శ్రీరంగంనుంచి తిరుమలకు పంపించి నిరాఘాటంగా కైంకర్యం చేయించిన పరమభక్తాగ్రేసరుడు శ్రీమద్రామానుజస్వామి. ఆ సందర్భంలో అనంతాళ్వానుతో శ్రీనివాసుడు పరాచికాలాడుతూ ఆయన పెంచిన పూలతోటకు వెళ్లి దాన్ని పాడుచేశాడు. ఆ ఘట్టానికి గుర్తుగా 'బాగ్ సవారీ' ఉత్సవాన్ని ఏర్పాటు చేశాడు రామానుజులు.

తిరుమల శ్రీవారి శుక్రవారాభిషేకంలో పాపవినాశతీర్థం, ఆకాశగంగాతీర్థం, బంగారుబావితీర్థాలు ఉపయోగించవచ్చని రామానుజులు తీర్మానించారు. శ్రీవారి తీర్థ కైంకర్యంలో పాల్గొనే తిరుమలనంబిని తాతా! తాతా! అంటూ ఒక బోయ యువ కుడిగా శ్రీనివాసుడు పరీక్షించిన కథను విన్న రామానుజుల వారు ఆ గాథకు గుర్తుగా "తణ్ణీరముదు ఉత్సవం" ఏర్పాటు చేశారు.



## తిరుచానూరు పంచమికి మాత్రం....

'పుష్పమండపం' అయిన తిరుమల క్షేత్రంలో శ్రీవారికి వినియో గింపబడే పుష్పాలు కానీ, పూజకు వినియోగం అయిన పుష్పాలు కాని ఎవ్వరూ ఉపయోగించరాదనీ, వాటిని భూతీర్థం అనే 'పూలబావి'లో వేయాలని ఏర్పాటు చేశారు భగద్రామానుజులు.

అయితే, ప్రతి సంవత్సరం కార్తిక శుద్ధపంచమినాడు అనగా 'శ్రీఅలమేలుమంగ' అవతరించిన 'తిరుచానూరు పంచమి' రోజున మాత్రం శ్రీవారి పూలమాలలు, పసుపు, కుంకుమ వగైరా సారెను తిరు చానూరు శ్రీ పద్మావతి అమ్మవారికి పంపించాలన్న ఏర్పాటును కూడ రామానుజులవారు చేశారు.

## తణ్ణీరముదు ఉత్సవం

**తిరుమలలో ఒకరోజు పాపవినాశం నుండి తీర్థాన్ని తెస్తున్న తిరుమలనంబికి శ్రీనివాసుడు బోయ యువకుడిగా అడ్డుపడి తాతా! నాకు దప్పికగా ఉంది, నీళ్లివ్వు అన్నాడు. "ఒరే! ఇది శ్రీస్వామివారి కైంకర్యం కోసం, నీకు నీళ్లివ్వను" అన్నాడు. కానీ, ఆ బోయవాడు వెనకనే నడుస్తూ, తన బాణంతో తిరుమలనంబి తలమీది కుండకు రంధ్రం చేసి దానినుండి కారిన నీటిని త్రాగాడు. ఖాళీ అయిన కుండను గమనించిన తిరుమలనంబి వెనకకు తిరిగి బోయవాణ్ణి చూచి 'ఒరే! ఎంత పాపం చేశావురా! ఇప్పటికే ఆలస్యమయిందే. తీర్థాన్ని మళ్లీ తేవాలి కదా!' అని చింతించగా "తాతా! తాతా! బాధపడకు. ఇదిగో ఈ కొండవాలులో చూడు. స్వచ్ఛమయిన జలం ఉంది. అంటూ బాణంతో కొట్టాడట! బాణం వల్ల పడిన రంధ్రం నుండి కారిన జలాన్ని తీసుకొని తిరిగి బోయవానికోసం చూడగా వాడు అదృశ్యమయ్యాడట!**

**దీనికి గుర్తుగా నేటికీ అదే రోజున తిరుమలలో "తణ్ణీరముదు ఉత్సవం" జరుగుతుంది. "అమృత జలోత్సవం" అన్నమాట. దీన్ని రామానుజాచార్యులు ఏర్పాటు చేశారు.**

అనగా ఆ రోజున తిరుమలనంబి వంశీయులు ఘనంగా స్వాగత సత్కారాలతో ఆలయంలో చందన తాంబూలాదులతో సంభావింపబడునట్లుగా ఏర్పాటుచేశారు.

తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవంలో ఐదవ రోజున గరుడోత్సవంనాడు శ్రీ విల్లిపుత్తూరు గోదాదేవి ధరించిన పూలమాలను తెచ్చి తిరుమల శ్రీవారికి ధరింపజేసే ఏర్పాటుతో పాటు, తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయంలోని ఆండాళ్ ధరించిన పూలమాలను, కనుమ పండుగ రోజున గోదా కల్యాణంరోజున తిరుమలకు తెచ్చి శ్రీవారికి సమర్పించే ఏర్పాటును రామానుజులవారు చేశారు.

తిరుమల శ్రీస్వామి పుష్కరిణి ఒడ్డున ప్రాచీనమైన యోగనరసింహస్వామి శిలావిగ్రహం పూజా పురస్కారాలు లేకుండా ఉండింది. ఆ మూర్తిని ఆలయంలో ప్రతిష్ఠింపజేసి, నిత్యనివేదనాదులు ఏర్పాటు చేశారు యతిరాజస్వామి వారు.

అలాగే తిరుపతిలో శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయంలో గోవిందరాజస్వామివారి మూలమూర్తిని ప్రతిష్ఠింపజేశారు. కపిలతీర్థంలో నాలుగుమూలలా శ్రీ సుదర్శనచక్ర యంత్ర స్తంభాలను ప్రతిష్ఠించి, అది "చక్రత్తాళ్వార్ తీర్థం" గా మార్పు చేయడంతో పాటు, తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి మరియు శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవాల అనంతరం ఈ 'చక్రత్తాళ్వార్ తీర్థం'లో 'చక్రస్నానం' అనే 'అవభృథం' జరిగేటట్లుగా ఏర్పాటు చేశారు. తిరుపతిలో ఆళ్వారుల అందరి విగ్రహాలను ప్రతిష్ఠింపజేశారు.

> **"శ్రీనివాసునికే శంఖచక్రాంకనం!**
>
> **పరమభక్తుడైన తొండమాను చక్రవర్తికి యుద్ధంలో రక్షణకోసం తన శంఖచక్రాలను ప్రసాదించాడు శ్రీనివాసుడు. వాటిని మళ్లీ తిరిగి ఇవ్వడానికి తొండమానుడు రాగా, ఇంకమీదట నీకు ప్రసాదించిన గుర్తుగా ధరించనన్నాడు. ఆ తర్వాతికాలంలో శంఖుచక్రాలులేని ఈ స్వామివారు, శివుడని వీరశైవులు వాదించారు. వాటిని ఖండిస్తూ భగవద్రామానుజులవారు తమ భక్తి ప్రపత్తులచే శంఖచక్రాలను సాక్షాత్తు స్వామివారే స్వయంగా ధరించునట్లుగా చేసి శ్రీమహావిష్ణువుగా నిరూపించారు. అందువల్ల శ్రీవారి ఆలయంలో శ్రీనివాసభగవానునికే గురుస్థానం అలంకరించిన ఆచార్యులుగా ప్రసిద్ధిని పొందినారు శ్రీరామానుజులవారు."**

ఇలా తిరుమల, తిరుపతి ఆలయాలలో అర్చనాది కార్యక్రమాలను, ఆలయ వ్యవస్థను సమున్నతంగా తీర్చిదిద్ది భవిష్యత్తరాల వారికి అందించిన ఘనత శ్రీరామానుజాచార్యులవారికి దక్కుతుంది.

తిరుమల శ్రీవారి ఆలయ సంప్రదాయంలో భగద్రామానుజాచార్యుల వారిని గూర్చి ఎంత చెప్పుకున్నాకొరతగానే ఉంటుంది అన్నది పరమసత్యం.

సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరునికే గురుస్థానం అలంకరించి, జగద్గురువుగా భాసిస్తున్న శేషాంశ సంభూతుడైన రామానుజులవారిని నిత్యమూ స్మరించి మనం అందరం కూడా తరించుదాం.

*రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే*



# తిరుమలలో...

# భాష్యకారుల ఉత్సవం



– శ్రీమతి ఎస్.ప్రవీణ

భగవద్రామానుజులు విశిష్టాద్వైత సిద్ధాంత పరంగా మీమాంసా గ్రంథానికి "శ్రీభాష్యం" పేరుతో వ్యాఖ్యానాన్ని సంతరించారు. అందుకే వారు "భాష్య కారులు"గా పేరు పొందారు.

వీరు వెయ్యేండ్లక్రిందట అనగా 1017 పింగళ నామ సంవత్సరం వైశాఖమాసంలో ఆర్ద్రానక్షత్రం రోజున ఆదిశేషుని అంశావతారంగా శ్రీపెరంబూదూరులో అవ తరించారు. వీరు తమ 120 ఏండ్ల జీవితంలో దేశమం తటా సంచరిస్తూ, శ్రీవైష్ణవమతాన్ని పరిపుష్టం చేస్తూ ప్రచారం చేశారు. అగ్రవర్ణాలవారికి మాత్రమేగాక అట్టడు గున ఉన్న నిమ్నజాతులవారికి కూడ ఈ వైష్ణవమత స్వీకార అర్హతను కల్పించారు. అంతేగాక ఈ మహనీ యుడు దేశంలోని అనేక శ్రీవైష్ణవక్షేత్రాల జీర్ణోద్ధరణ, అభి వృద్ధి, చెయ్యడంతో పాటు, ఆలయపూజాది కార్యక్రమాలు సక్రమంగా నిర్వహింపబడేట్లుగా ఏర్పాట్లను కట్టుదిట్టంగా చేశారు.

శ్రీరామానుజులవారు తమ పర్యటనలో భాగంగా తిరుమలక్షేత్రాన్ని మూడుమారులు సందర్శించి ఆలయం లోని అర్చనా విధానాలను సక్రమంగా తీర్చిదిద్దారు.

శ్రీస్వామివారి తీర్థకైంకర్యం, పుష్పకైంకర్యం వంటి, సేవలకు తిరుమలనంబి, అనందాళ్వాన్‌వంటి మహనీయు లను నియమించారు. అనేకఉత్సవాలను సక్రమంగా నిర్వహించే ఏర్పాట్లను చేశారు. అంతేగాక శిష్యుడైన అనందాళ్వారుల కోరిక మేరకు తన శిలా విగ్రహాన్ని ప్రసాదించారు. ఆ మూర్తినే శ్రీవారిఆలయంలోని "సన్నిధి భాష్యకారులు" అంటారు.

ఆనాటి నుండి తిరుమలక్షేత్రంలో భగవద్రామాను జాచార్యులవారికి ఉత్సవాలు జరుగుతున్నాయి. వారి అవ తార నక్షత్రం 'ఆరుద్ర' కనుక ప్రతినెలా ఆర్ద్రనక్షత్రం రోజున మాసోత్సవం,ప్రతిఏడాది వైశాఖమాసంలో "భాష్య కారుల ఉత్సవాలు" జరుగుతున్నై. ప్రతినెలా ఆర్ద్రనక్షత్రం నాటి సాయంత్రం శ్రీమలయప్పస్వామివారు శ్రీభూదేవేరు లతో "సహస్ర దీపాలంకరణసేవ"లో పాల్గొంటారు.

అంతలో భగవద్రామానుజులవారు మరోపీఠాన్ని ఎక్కి శ్రీస్వామివారికి అభిముఖంగా ఉంటూ తిరుమల తిరు వీధుల్లో ఊరేగింపబడతారు. ప్రతినెలా ఆర్ద్రనక్షత్రం రోజున జరిగే **"భాష్యకారుల ఉత్సవం"** ఇది.

ప్రత్యేకంగా ప్రతి సంవత్సరం మేషమాసంలో అనగా వైశాఖమాసంలో ఆర్ద్రానక్షత్రం రోజునకు ముందు పది రోజుల నుంచి భాష్యకార్ల ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి. ఈ పదిరోజులపాటు శ్రీస్వామివారి "సహస్రదీపాలంకరణ సేవ" అనంతరం సాయంత్రంపూట శ్రీస్వామివారికి అభిముఖంగానే శ్రీరామానుజులవారు తిరుమల వీధుల్లో ఊరేగింపబడతారు.

ఊరేగింపు పూర్తి అయిన తర్వాత 'సన్నిధి భాష్యకారుల' సన్నిధిలో ఆస్థానం జరుగుతుంది. నివేదనలు జరుగుతాయి. నివేదనానంతరం శ్రీస్వామివారి మాలలను భాష్యకారులకు సమర్పిస్తారు. ఆ తర్వాత శ్రీవారి హారతిని, మళ్లీ శ్రీరామానుజులకు ఇస్తారు. దీన్నే శేషహారతి అంటారు.

పిదప శ్రీరామానుజుల మూలమూర్తికి, ఉత్సవ మూర్తికి శఠారిమర్యాదలు జరిగిన తర్వాత. ప్రసాద వితరణ చేస్తారు. పిదప శ్రీ స్వామివారు ఆనందనిలయంలో ప్రవేశించడంతో భాష్యకారుల 'ఆర్ద్రా నక్షత్రోత్సవం' పూర్తి అవుతుంది. వీటినే **"భాష్యకారుల ఆర్ద్రానక్షత్రోత్సవాలు"** అనీ **"భాష్యకారుల జయింతి ఉత్సవాలు"** అని అంటారు.

**యతిరాజాయ మంగళమ్**



:: 90 - సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 క | | 2 శ్రీ | 3 నా | థ | 4 క | వి | |
| | 5 బో | ధి | | గా | | బ్దం | | 6 ప |
| 7 మ | ది | | 8 స | వ | ర | | 9 ణ | రా |
| హిం | | 10 సు | | ఖ | | 11 ణ | ర | శ |
| 12 ద్ర | భ | గ | తుం | | 13 వం | శ | ధా | ర |
| త | | మం | | 14 గో | | ర | | సూ |
| 15 న | టి | | 16 వే | దా | ద్రి | | 17 మం | తి |
| య | | 18 త్రు | | వ | | 19 లం | జీ | |
| | 20 వ | టి | | 21 రి | క్క | | ర | |



# అలిపిరి

**తి**రుపతి నుంచి తిరుమల శ్రీవారి దర్శనానికి వెళ్లే తొలిమెట్టే **"అలిపిరి"**. ఇక్కడ శ్రీస్వామివారి శిలాపాదాలతో కూడిన శ్రీనివాసుని గుడి నిర్మింపబడి ఉంది.

ఈ "అలిపిరి" ని 'అడిపుళి' అని కూడా అంటారు. పుళి అనగా చింతచెట్టు. పూర్వం ఇక్కడ పెద్ద చింతచెట్టు వుండేదనీ, దాని నీడ క్రింద పడకుండా వ్యాపించిన విశాలమైన చింతచెట్టు కనుక "నీడ తిరుగని చింతచెట్టు" అనేవారు. భగద్రామానుజులవారు తిరుపతికి వచ్చిన సందర్భంలో ఈ చింతచెట్టు కింద గురువైన తిరుమలనంబితో శ్రీరామాయణ పాఠాన్ని విన్నారట. వారు చెప్పినఅర్థం చెప్పకుండా 18 రకాల అర్థాలతో వ్యాఖ్యానిస్తూ శిష్యుడైన రామానుజులకు రామాయణరహస్యాన్ని బోధించారట!

అలా బోధిస్తున్న సమయంలో పూజకు వేళమించిపోయిందే అని చింతిస్తున్న సమయంలో, శ్రీనివాసుడు తన పాదాలను ప్రత్యక్షంగా దర్శింపచేసి అక్కడే పూజ చేసుకొమ్మన్నాడట. అలా వెలసిందే ఈ అలిపిరి **పాదాల మండపం!**





# అన్నమాచార్యుల 'రామానుజదర్శనం'



– ఆచార్య కె.సర్వోత్తమరావు, 9704104000

**దేవమర్త్యజనాళికి 'శరణాగతి' ఒకటే శరణ్యమని బోధించిన సర్వజన శ్రేయఃకాంక్షపరుడు రామానుజులే. వైష్ణవోచితమయిన ముద్రాధారణతో ఒక ప్రత్యేకతను నిలబెట్టిన సంస్కారవంతుడు రామానుజులే. 'దైవం మానుషరూపేణ' అన్నట్లు మాటలాడే దైవం ఆతడే.**

కావేరితీరంలో పవిత్రస్నానంకోసం అడుగులపై అడుగులు వేసుకొంటూ ఆనందంతో వచ్చేవారిని చూచి 'ఆగండి దూరంగా వెళ్ళిపోండి' అని కేకలేసేవారి బెది రింపులు...

కనీసం మా వూరి స్వామిని దర్శించుకొంటే కష్టాలు అన్నీ తీరతాయంటూ కదలివచ్చేవారిని చూచి కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ కాలయమునిలా గద్దించే వారి అదలింపులు....

'ఇది నా రాజ్యం. ఈ భూమండలంలో నేను చెప్పిందే చట్టం. నా కెదురు చెప్పేవారిని సుతరామూ క్షమించను. నా మాటకీ చేతకూ తిరుగులేదు. ఎంత వారైనా నా ముందు తలవంచవలసిందే, అని కరవాలంచేత బట్టుకొని రాజ్యాధి కారి ఆనలను అమలు పరిచే అధికారుల ఆగడాలు....

మా మంత్రాలు వింటే మసయిపోతారని తారస్థాయిలో తైతక్క లాడేవారి ఆకారాలు....

మతవిశ్వాసాలపట్ల మాదారేది అని ప్రశ్నిస్తూ చిమ్మచీకట్లో తచ్చాడేవారు

ఇవన్నీ నగ్నసత్యాలు. వీటికి పరిష్కారాలు లేవా? సమస్త ప్రజానీకానికి సన్మార్గం చూపే గురువులేడా? లేకేం?

అదిగో! అన్నమయ్య ముందు కనిపించిన ఆదిశేషుని అవ తారమూర్తి –

**ముద్దుమోమువాడు కెంజిగురు మోవివాడు**
**కరుణాకటాక్షాల కన్నులవాడు నునుపైన చెక్కిలివాడు**
**బంగరు మేనివాడు తీర్చిదిద్దిన ఊర్ధ్వపుండ్రాలవాడు**
**తెల్లని జందెమువాడు త్రిదండం చేతబట్టినవాడు**

ఇతడే ఇతడే యతిరాజులు.

అన్నమయ్యకు యతిరాజులు సామాన్యులుగా కనిపించలేదు

కనిపించిన మూర్తి ఘనుడా?

దర్శింప చేసే గురువా?

కానే కాదు. దర్శనమిచ్చి ధన్యులజేసే దైవమా?

కల్లోల పూరితమనస్కులకు కాంతిపుంజంలాంటి ఘనగురు దైవం!

ఆ దైవం అన్నమయ్య కేసి చూస్తున్నది.

రమ్మని ఆహ్వానిస్తున్నట్టున్నది!!

అన్నమయ్య క్షణంకూడా ఆలోచించలేదు.

చినుకు మరో చినుకుతో జతగట్టి 'పోదాంపద' అని

ప్రవాహంకేసి పరువులెత్తినట్లు అన్నమయ్య పాదాలు

ఆకాశాన్నంటే సప్తగిరులకేసి నడక సాగించాయి అదే మోకాలి మిట్ట.

తిరుమలకు వాకిలిగా కనిపించే తీరయినగుట్ట.

ప్రవాహానికి అడ్డుతగిలితే ఆగినట్టు భక్తాగ్రేసరుడు అన్న మయ్య ఆగాడు.

కళ్ళముందు శ్రీభాష్యకారుల సన్నిధి –

ఆదిశేషుడతడు!

అయోధ్యారాముని అనుజుడతడు!

కలియుగం కలుషాలను కడిగివేయడానికి తరుణోపాయం సూచించిన తపోధనుడతడు!

కృతానాం సర్వపాపానా మనిశం కరుణైస్త్రిభిః
ప్రాయశ్చిత్తం యతీంద్రస్య పాదాబ్జస్మరణం ధ్రువమ్ ॥

సత్యం సత్యం పునస్సత్యం యతిరాజో జగద్గురుః
స ఏవ సర్వలోకానా ముద్ధర్తా నాత్ర సంశయః ॥

న చే ద్రామానుజేత్యేషా చతురా చతురాక్షరీ
కామవస్థాం ప్రపద్యన్తే జన్తవో హన్త! మాదృశః ॥

కళ్ళారా దర్శించిన ఆచార్యులను కమనీయ సంకీర్తనలతో గానం చేశాడు అన్నమాచార్యులు

గతులన్ని ఖిలమైన కలియుగమందున
గతి యీతడే చూపె ఘనగురుదైవము
.....................................
నయమై శ్రీవేంకటేశు నగమెక్కి వాకిటను
దయఁజూచి మమ్ము నిట్టే తల్లిదండ్రి దైవము

'సర్వం దైవాధీనం' అన్నీ భగవత్సంకల్పంతోనే జరుగుతాయి. స్మార్తసంప్రదాయం పాటించే, చౌడేశ్వరి ఉపాసన చేసే నందవరీకులయిన మమ్మల్ని స్వామి వైష్ణవులుగా తీర్చి దిద్దాలనుకొన్నాడేమో! రామానుజుల ప్రేరణతోనే ఘన విష్ణువు వైష్ణవదీక్ష ఇచ్చాడు కాబోలు. పంచసంస్కారాలు తిరుమలలోనే జరగడం పరమాత్ముని ఆదేశం. అష్టాక్షర మంత్రోపదేశం ఆచార్యుల కృపా విశేషం. ఇహానికి పరానికి ఆతడే దైవం. ఆ దైవం మరెవ్వరోకాదు 'భగవద్రామానుజులే'.

కువ్యాఖ్యానాల కారణంగా అసలు వేదరహస్యాలు పక్కదారి పట్టాయి. అంతస్సత్యాలు అబద్ధాలు వితండవాదాల కారణంగా అడుగునపడ్డాయి. అయినా అసలు అర్థాలను స్పష్టంగా వాదప్రతివాదాలతో నిరూపితం చేసిన వేదార్థ కోవిదుడు భాష్యకారులు రామానుజులే. కాశ్మీరంలో కమలజురాణి ప్రశంసించిన పరమభాగవ తోత్తముడు రామానుజులే. దేవమర్త్యజనాళికి 'శరణాగతి' ఒకటే శరణ్యమని బోధించిన సర్వజన శ్రేయఃకాంక్షపరుడు రామానుజులే. వైష్ణవోచితమయిన ముద్రాధారణతో ఒక ప్రత్యేకతను నిలబెట్టిన సంస్కారవంతుడు రామానుజులే. 'దైవం మానుషరూపేణ' అన్నట్లు మాటలాడే దైవం ఆతడే.



నియమరహిత జీవనం గాలిపటంలాంటిది. శ్రీవైష్ణవోచిత నియమాలు 82 ని 'వార్తలుగా' ప్రపన్న లక్షణాలుగా ప్రసాదించిన పరమాత్ముడే రామానుజులు. భగవంతు డొకడే మోక్షప్రదాతకాడు. తన్ను సేవించేవారికి తన ఉపదేశం పాటించేవారికి తానున్నాననే భరోసా కల్పించి మోక్షం ప్రసాదించే దైవం.

పోషణకూ, లాలనకు తల్లిలాంటివాడు. తగిన మార్గంలో పయనించడానికి వీలుగా సలహాలు, కట్టడి చేయడంలో తండ్రి లాంటివాడు. అంతేకాదు 'అడియేన్' అని అడుగుల పడినవానిని ఆదరించే అనుగ్రహించే అపరదైవం రామానుజులు.

ఆకర్షకమూర్తి, సప్తగిరీశుని దర్శించండని ఆహ్వానిస్తూ వాకిట నిలబడి ఆహ్వానించేలాగున మోకాలిమిట్ట ప్రాంగణంలో నిలచిన 'త్రోవభాష్యకారుల'కు నమస్కరిద్దాం.



రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే




శ్రీరామానుజులవారు ప్రపంచంలోనే ఆదర్శమూర్తిగా కీర్తించబడ్డారు. విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని శాశ్వతంగా సుస్థిరం చేయాలన్న విశాలదృక్పథంతో/ ముందుచూపుతో శ్రీరామానుజులవారు తొమ్మిది రచనలను చేశారు.

అవి - 1) శ్రీభాష్యం, 2) వేదాంతదీపః, 3) వేదాంత సారః, 4) గీతాభాష్యం, 5) వేదార్థ సంగ్రహః, 6) శరణాగతి గద్య, 7) శ్రీరంగగద్య, 8) వైకుంఠగద్య, 9) నిత్య గ్రంథః.

వీటిలో శరణాగతిగద్య, శ్రీరంగగద్య, వైకుంఠగద్య అనే మూడింటినీ కలిపి **'గద్యత్రయం'** అని పిలుస్తారు. ఇవన్నీ సంస్కృత రచనలే.

***యతిరాజులవారి 'గద్యత్రయం' స్వయంగా అనుభవించిన, అనుభూతిగల భావ పరిమళసుధాలహరులతో వైష్ణవలోకాన్నీ / పాఠకలోకాన్నీ పరవసింపచేస్తుంది.***

## గద్యత్రయ అవతరణం

అదొక సన్మంగళ సమయం. శ్రీరంగంలో శ్రీరంగనాచ్చియార్ తిరు నక్షత్ర సందర్భంగా శ్రీరంగనాథులవారు తాయారుల సన్నిధికి వేంచేస్తారు. శ్రీరంగ నాచ్చియార్ - శ్రీరంగనాథులు ఒకచోట ఆసీనులై ఉన్నపుడు రామానుజులవారు ఆ దివ్య దంపతులను సేవించి ఆనందపర వశులై ఆశువుగా భక్తిపారవశ్యంతో గద్య త్రయాన్ని (ఆ దివ్యదంపతులకు) వినిపిస్తారు. ఆ దివ్యదంపతుల కరుణా కటాక్షానికి రామానుజులవారు పాత్రులవుతారు. **ఉదయవరులు అనే పేరు రామానుజుల వారికి ఈ సందర్భానే అనుగ్రహించ బడుతుంది.**

## గద్యత్రయ ప్రశస్తి - ప్రశంస

సంస్కృత సాహిత్యసరోవరంలో స్తోత్రసాహిత్యం భక్తిరసంతో నిండిపోయిన రసలోకం. భక్తుల హృదయస్పందననే వాక్కులరూపంలో స్తోత్రంగా ఆవిర్భవిస్తుంది. రామానుజులం తటి మహానుభావుడు అనుభూతితో రచించిన గద్య త్రయం గురించి చెప్పటానికి మాటలు చాలవు. జనప్రియమైన సరళసుందరమైన స్తోత్రం గద్యత్రయం. భక్తజనుల హృదయాలను ఆనందామృతంతో అభిషేకిస్తుంది గద్యత్రయం.

ప్రాతః- మధ్యాహ్న- సంధ్యా సమయాలలో శరణాగతి- శ్రీరంగ- వైకుంఠ గద్యలను భక్తిభావభరితంగా పరవశించి పాడితే మంగళకరమైన వాతావరణం దానంతట అదే ఏర్పడుతుంది. ఈ వాతావరణం అక్కడక్కడా శ్రీవైష్ణవ తిరుమాళిగలలో, తిరుక్కోవెలలో మనం నేడూ గమనించవచ్చు.

సర్వసాధారణంగా స్తోత్రాలు శ్లోకాలలో (పద్యాలలో), సంకీర్తనలలో

రచిస్తుంటారు. అయితే గద్యత్రయం స్తోత్రవాఙ్మయానికి చెందిందైనా గద్యంలో రచించటం విశేషం. ఇవి గద్యలో రచించినా కూడా ఒక రాగ ప్రవాహంలో వినసొంపుగా, పరవశత్వం పరమానందం కలిగించే విధంగా ఉంటాయి. గద్యత్రయాన్ని గానం చేస్తే అర్థం కాకున్నాకూడా అదొక ఆనం దానుభూతిని కలిగిస్తుంది. అర్థమైతే మరీ ఆనందకరమే. గద్యత్రయం పఠనా చాతుర్యంలోని మాధుర్యానికి సొక్కని మానవులు ఉండరు. రామానుజులవారి విద్వత్తు, భక్తి, ప్రపత్తి ఈ మూడు కూడా మూడుగద్యలలోనూ త్రివేణీ సంగమంలా కలిసి ప్రవహించాయి. గద్యత్రయాన్ని అనుభూతితో చదివినా విన్నా కన్నులలో ఆనంద బాష్పాలు చమరుస్తాయి, శరీరం రోమాంచితమౌతుంది, హృదయపద్మం శ్రీమన్నారాయణుని పాదపద్మాలపై వాలి పోతుంది. ఇంతకన్నా ప్రపన్నునికి కావలసింది ఇంకేముంటుంది. ప్రపన్న జనులకు గద్యత్రయం నిత్యమూ అనుసంధేయం. తాపత్రయ వ్యాధితో బాధపడేవారికి రామానుజుల వారి గద్యత్రయం పరమౌషధం.

ఇక గద్యత్రయంలోని ఒక్కొక్క గద్యను గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

## శరణాగతి గద్య

శరణాగతి అంటే కాపుదల, దిక్కు అని అర్థం. ప్రపత్తి, ప్రపదనం, రక్షణం, శరణం, శరణ్యం, సంత్రాణం మొదలయిన పదాలు శరణాగతికి పర్యాయాలు. శ్రీరంగనాథుని శరణాగతిని పొందటం గురించి వివరించిన గద్య కనుక 'శరణాగతిగద్య' అని పేరు. శరణాగతిగద్యలో 29 వాక్యాలున్నాయి.

మొదటి వాక్యంలోనే 'పురుషకార' అమ్మవారు లక్ష్మీదేవిని శరణు పొందటం చెప్పబడింది. 'పురుషకార' అంటే సిఫార్సు/ రెకమెండేషన్ అని అర్థం. అమ్మవారిని మొదట శరణువేడితే ఆమె శ్రీవారికి ప్రపన్నుని కాపాడవలసిందని 'మాటసాయం' చేస్తుందని శరణాగతునికి మిక్కుటమైన నమ్మకం. ఇది శరణాగతి గద్యలో మాత్రమే కాదు సుమా! భార్యతో భర్తకు / అమ్మతో నాన్నకు మాటసాయం చేయించటం లౌకిక ప్రపంచంలోనూ చూస్తుంటాం.

అందుకే రామానుజులవారు "అస్మన్మాతరం, అఖిల *జగన్మాతరం, అశరణ్య శరణ్యాం, అనన్య శరణశ్శరణ మహం ప్రపద్యే"* అన్నారు. అంటే 'ఎల్ల లోకాలకూ తల్లివైన మాయమ్మా! ఏ దిక్కూలేనివారికి గొప్ప దిక్కయిన దానా! వేరేగతి లేనివాడనైన నేను నిన్ను శరణు పొందుతున్నాను' అని అర్థం. కొడుకు దీనంగా వేడుకొంటే అమ్మకు దయ కలిగితీరుతుంది. అది అమ్మకు ఉండే నైజ లక్షణం. అలాంటప్పుడు అఖిల జగాలకూ మాత అయిన లక్ష్మీదేవికి దయ కలుగదా! ఆమె దీనుడైన ప్రపన్నుని గురించి పురుషోత్తమునికి తెలిపి ఆదుకుంటుంది. ప్రపన్నుని విశ్వాసాన్ని రామానుజులవారు సరళసుందరమైన వాక్యాలతో నాదరంజితమైన పదప్రయోగాలతో శరణాగతి గద్యను రచించారు.

శరణాగతిగద్య ఐదవ వాక్యంలో "శ్రీమన్నారాయణ *అశరణ్య శరణ్య అనన్య శరణస్త్వత్పాదారవింద యుగళం శరణ మహం ప్రపద్యే"* అంటారు రామానుజులవారు. ఇక్కడ ద్వయ మంత్రార్థం ఉంది. స్వామివారు ఎల్లలులేని కరుణ కలవారు. సుశీలుడు, తప్పులను మన్నించగల వాత్సల్యం కలవాడు. తనను నమ్మిన అల్పునికైనా వైభవాన్ని ప్రసాదించే ఔదార్యగుణం కలవాడు, అంతేకాదు పుట్టుక, కులం, తెలివితేటలు, చదువు మొదలైన భేదభావాలు చూపక శరణుజొచ్చిన వారికందరకూ దిక్కైన వారు శ్రీవారు. *'అనాలోచిత విశేష అశేషలోక శరణ్య'* అని గద్యలో అనటం గమనార్హం. కాబట్టి ఎలాంటివారైనా, ఎట్టివారైనా, ఎట్టి పరిస్థితులలో ఉన్నా సంపూర్ణ విశ్వాసంతో భగవానుని శరణు పొందితే రక్షకత్వం లభిస్తుందని శరణాగతి గద్య తేటతెల్లంగా తెలుపుతోంది.

గజేంద్రుడు, విభీషణుడు, ద్రౌపది మొదలయిన వారికి శరణాగతి వల్లనే వారి మనోరథం సఫలీకృతం అయింది. అంటే శరణాగతికి అంతటి ప్రాముఖ్యత ఉందన్నమాట. ప్రపత్తి (శరణాగతి) మార్గంలో పెరుమాళ్లకు దాసానుదాసదాసుడై అత్యంత సులభంగా మోక్షాన్ని పొందవచ్చని రామానుజులు

***ధైర్యంతో కూడిన ప్రేమ, వెన్నుచూపని నైతిక యుద్ధకౌశల్యం,***
***భావితరాల శ్రేయస్సును పసిగట్టే ముందుచూపు,***
***ఎంచరానంత ఘనమైన ఆత్మబలం వంటి విశేషగుణాలతో***
***విరాజిల్లిన శ్రీమద్రామానుజులొక్కరే -***
***ధార్మికంగా, సామాజికంగా, విప్లవాత్మకమైన***
***మార్పులను ప్రవేశపెట్టినారు.***

***- డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్***

వెల్లడించారు. శరణాగతిగద్య ద్వయమంత్రానికి వ్యాఖ్యాన రూపంగా ఉందని పెద్దలమాట. శరణాగతి గద్యపఠనం వల్ల నారాయణుని అనుగ్రహప్రాప్తికి అర్హత కలుగుతుంది. భక్తికి పరాకాష్ఠ రూపం శరణాగతి. 'సప్రమాతినప్రమ శరణాగతి' అనేది ఈ గద్యభావాలలో తొణికిసలాడుతోంది. గద్యంలోని పదప్రయోగాలు నిగూఢార్థం సంతరించుకున్నవి. ఉదాహరణకు 'వాత్సల్య' పదం. వాత్సల్యం అంటే అప్పుడే పుట్టిన లేగదూడ ఒంటిపై ఉండే మాలిన్యాన్ని ఏ మాత్రం మిగలకుండా నాకుతూ తిని దూడను నిర్మలినంగా చేస్తుంది ఆవు. అంతటి ప్రేమ ఉంటుంది దూడపై ఆవుకు. వత్సం (ఆవు) పై ఉండే అలాంటి ప్రేమకే వాత్సల్యం అనిపేరు. ప్రపన్నులపై పెరుమాళ్లకు అంతటి వాత్సల్యం ఉంటుందన్నమాట.

**శ్రీమద్రామానుజుల హృదయం విశ్వమంత విశాలమైనది.**

గద్యత్రయంలో శరణాగతిగద్య కృతిరత్నం. రామానుజుల వాణికి గద్యత్రయం మకుటంలాంటిది కాగా శరణాగతిగద్య ఆ కిరీటంలో అనర్ఘరత్నం. శరణాగతిగద్య ఒక రకంగా సంవాదాత్మక కృతి. ఈ గద్యలోని పదాలన్నీ కూడా మృదుమధురంగా ఉంటాయి. ఇది ఒక ధ్వని నాటకంగా భాసిస్తుంది. గద్యను పఠిస్తూ ఉంటే మనస్సులో మార్పు కలుగుతూ ఉంటుంది. ముఖం వికాసాన్ని పొందుతుంది. కనులు ఆనందా శ్రుపూరితాలవుతాయి. శరీరం రోమాంచితం అవుతుంది. శరణాగతిగద్య ఎనిమిది విభాగాలుగా రచించబడింది. శరణాగతిగద్యను 'పృథు గద్య' అని అంటారు.

## శ్రీరంగ గద్య

శ్రీరంగనాథులవారు సప్తప్రాకారమధ్య విరాజితులు. భగవద్రామానుజులవారి శ్రీరంగగద్య సప్తవిషయాత్మకం. శ్రీరంగ క్షేత్ర రామణీయకతనీ అక్కడి రమణీయ దృశ్యాలనూ, దీనికంతటికీ కారణభూతులైన శ్రీరంగనాథులవారి సౌందర్య స్వరూపాన్నీ స్పష్టం చేస్తుంది శ్రీరంగగద్య. గద్యలో భక్తిభావ గంగాలహరి శ్రీరంగనాథులవారి చరణ కమలయుగళిని అభిషేకించింది.

శ్రీరంగగద్యలోని నాలుగవ వాక్యంలో "ఓ స్వామీ! నీ అనుభవం వల్ల నీ కైంకర్యమందు ఎక్కువ ప్రీతి కలిగేటట్లు దాసుని అనుగ్రహించాలి. వేరే రక్షకం ఎక్కడా చూడలేదు" అని ఉంది. దీనిని బట్టి కేవలం శ్రీరంగనాథుని మాత్రమే రక్షకంగా భావించటం జరిగిందని సుస్పష్టం అవుతుంది. ఒకే దైవాన్ని నమ్మి కొలువాలనే బోధకూడా ఇందులో దాగి ఉంది.

శ్రీరంగ గద్యంలో శ్రీరంగనాథుల వర్ణనం, రామానుజుల వారు శ్రీరంగనాథుని సేవించే భావన అభివర్ణితం. శ్రీరంగ నాథుల కైంకర్యం ప్రతినిత్యమూ చేయాలనీ అలాంటి కైంకర్య పరునిగా తనను (రామానుజులవారిని) పెరుమాళ్లే చేయాలని తలుస్తారు యతిరాజులవారు.

"అఖిల జగత్ స్వామిన్, సత్యకామ, సత్య సంకల్ప, ఆపత్సఖ, కాకుత్స్థ, శ్రీమన్నారాయణ, పురుషోత్తమ, శ్రీరంగనాథ, మమనాథ, నమో స్తుతే" అని శ్రీరంగగద్య ముగుస్తుంది. ఈ గద్యను విన్నవారికి/ చదివినవారికి వీనులకు మనసుకు పరమానందం కలిగిస్తుంది. ఆ అనుభూతిని చెప్పటానికి మాటలు చాలవు, అది అనుభవిస్తేనే తెలుస్తుంది.

భగవత్కైంకర్యానికి, రంగనాథులవారికి సంబంధించిన అనేక నిగూఢార్థాలు ఈ గద్యలో ఇమిడి ఉన్నాయని పండితులు వ్యాఖ్యానాలలో తెలిపారు. శ్రీరంగగద్యకు 'మితగద్య' అని పేరు.

## వైకుంఠగద్య

ఆదిశేషుడు పాన్పుగా, ఆసనంగా, ఛత్రంగా నిరంతరం భగవత్కైంకర్యం చేసే నిత్యసూరి. ఆదిశేషుని అంశావతారమే రామానుజులవారు. కనుక వైకుంఠ గద్యలో వాస్తవిక చిత్రణ కనిపిస్తుందని పెద్దలమాట. వైకుంఠాన్ని ప్రత్యక్షంగా చూస్తూ రామానుజులవారు 'గచ్ఛద్వ్యాఖ్య' (రన్నింగ్ కామెంటరీ) చేసినట్లు ఉంటుందీ గద్య. వైకుంఠాన్ని కనులకు కట్టించే 'టూరిస్ట్ గైడ్'లా ఉంటుందీ గద్య. వైకుంఠగద్యను అనుభూతితో స్పందిస్తూ పఠిస్తే ఒక 'స్పిరిచువల్ పిక్‌నిక్' వెళ్లినట్లు ఉంటుంది. అది అనుభూతితో చదివేవారి 'తీరు'ను బట్టి ఉంటుంది.

శ్రీవైకుంఠగద్యను తాదాత్మ్యంతో పఠిస్తే అదొక రస యాత్రలా ఉంటుంది. రామానుజుల తదనంతరకాలాన పిళ్లై లోకాచార్యులు మొదలయిన వారు రచించిన అర్చిరాది రహస్య గ్రంథాలు వైకుంఠగద్యకు వివరణాత్మకమైన అనువాదాలు అనిపిస్తాయి. వైకుంఠగద్యకు 'ప్రాప్యగద్య' అని పేరు.

ఎంతో మహిమాన్వితమైనదీ, దివ్యానుభూతిని కలిగించేదీ అయిన గద్యత్రయాన్ని అనునిత్యం పఠిద్దాం. పరమానంద పథంలో పయనిద్దాం.



# సంఘసంస్కర్తగా....

# శ్రీభగవద్రామానుజులు

- డా॥ సముద్రాల లక్ష్మణయ్య



**భగవద్రామానుజులు అంత్యజులనుండి బ్రాహ్మణుల వరకు అందరికీ భక్తిమార్గం సమానమే అని ప్రబోధించారు.**

కాలగమనం అప్రతిహతమైనది. జీవనది లాగా అది నిరాటంకంగా, అనుస్యూతంగా ప్రవహిస్తూనే ఉంది. ఇదొక సృష్టి వైచిత్ర్యం.

శ్రీభగవద్రామానుజులు అవతరించి ఇప్పటికి వెయ్యేండ్లు గడచిపోయాయి. పుట్టినవాడు గిట్టక తప్పదు. కాని లోకోత్తరములైన లోకాద్ధారక కార్యములు నిర్వహించి తమదైన ముద్రను శాశ్వతంగా లోకంలో నిల్చిపోవునట్లు చేసి కనుమరుగైపోయిన మహాపురుషులు మరణించిన వారి క్రింద లెక్కింపబడరు. తమ జీవనంతో బహుజనానీకానికి ఉజ్జీవనం కల్గించిన మహనీయులు శాశ్వతంగా జీవించు వారే.

అట్టి శాశ్వత జీవితసంశోభితులు శ్రీభగవద్రామానుజులు. భగవత్ప్రేరణతో వారు ఈ జగత్తులో అవతరించారు. విశిష్టాద్వైత దర్శనాన్ని తన పేరుతో రామానుజ దర్శనంగా తీర్చిదిద్దారు. సమాజంలోని స్థితిగతులను చక్కగా అవగతం చేసుకొన్నారు. 'సమబుద్ధే యిందరికీ సర్వవేద సారము' అన్నట్లు వేదనిర్దిష్టమైన సమదృష్టి లోకంలో ఆచరణలో లేకపోవడాన్ని గమనించారు. సమత్వం మాటలకు పరిమితమై ఆచరణకు దూరం కావడాన్ని ఆచార్యుల వారు సహించలేకపోయారు. ఆ పరిస్థితిని చక్కదిద్దటానికి ప్రయత్నించి చాలవరకు సఫలప్రయత్నులయ్యారు, ఈ ప్రయత్నమే వారిని ఇతరాచార్యులకంటే విశిష్టవ్యక్తిత్వం కలవారినిగానూ, సంఘసంస్కర్తగానూ, లోకోద్ధారకులైన మహాపురుషులుగానూ రూపొందించిందనడంలో సందేహం లేదు.

**శ్రీరామానుజాచార్యులు ముఖ్యంగా బోధించిన ప్రపత్తిమార్గంలో నడవడానికి వర్ణవ్యత్యాసం, కులభేదం, లింగభేదం - ఇత్యాదులు అడ్డు రావు. అందరినీ భగవదనుగ్రహానికి పాత్రులను కావించే ఉత్తమోత్తమ మార్గమిది.**

వర్ణవ్యవస్థవల్లా, అందులో అంతర్భాగమైన కుల వ్యవస్థవల్లా వేదం బోధించిన సమదర్శనానికి సమాజంలో నిలువనీడ లేకుండాపోయింది. పరవ్యూహాదులగు పరమాత్ముని పంచస్వరూపాలతో 'అంతర్యామి'గా భగవంతుడు అందరిలోనూ ఉన్నాడని శాస్త్రాలు నిస్సంశయంగా బోధించాయి. ఈశ్వరుడు సర్వభూతాల హృదయాలలో ఉన్నాడని (ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేஉర్జున తిష్ఠతి) గీత ఘోషించింది. కాని మతాచార్యులు పరవ్యూహవిభవార్చా స్వరూపాల కిచ్చిన ప్రాముఖ్యాన్ని 'అంతర్యామి' స్వరూపానికి ఇవ్వలేకపోయారు. అందువల్ల సమదృష్టి లేని దుఃస్థితి ఏర్పడింది.

శ్రీభగవద్రామానుజులు తమకు తమ గురువర్యులు బోధించిన తిరుమంత్రమును ఇతరులకు చెప్పరాదు, అలా చెప్పితే నరకప్రాప్తి కల్గునని హెచ్చరికలున్నా, సామాన్య జనులను గూడా తరింపజేయాలన్న సద్భావనతో

గుర్వాజ్ఞను అతిక్రమించి గోపురమెక్కి వారూ, వీరు అనే తేడా లేకుండా అందరికీ తిరుమంత్రాన్ని ప్రబోధించారు. వారి హృదయ వైశాల్యమెంతటిదో దీని వల్ల గమనించవచ్చు. జరిగిన సంగతి గ్రహించి గురువుగారు ఆశ్చర్యచకితులై శిష్యుణ్ణే 'మన్నాథా!'(ఎంబెరుమానార్!) అని సంబోధించారు.

**వెయ్యి సంవత్సరాలకు పూర్వమే కులభేదరహితమైన విశాలహృదయంతో ఆచార్యులవారు విలసిల్లారంటే వారి ఘనత ఎట్టిదో మాటలకందనిది**

ఆచార్యులవారు ధర్మపత్నిని పరిత్యజించి తదుపరి సన్న్యసించడం కూడా వారి సంస్కరణాత్మకమైన సమభావాన్ని నిరూపిస్తున్నది. మహామహులైన శ్రీకాంచీపూర్ణుల భుక్తశేషాన్ని స్వీకరించవలెనని సంకల్పించి వారు వారిని ఇంటికి భోజనానికి ఆహ్వానించారు. కాని శ్రీకాంచీపూర్ణులు తక్కువకులం వారన్న కారణంగా రక్షకాంబ శ్రీరామానుజుల సత్సంకల్పాన్ని నెరవేరనీకుండా అడ్డుపడింది. అలా జరిగినందుకు శ్రీరామానుజులు ఎంతో ఖేదానికి గురి అయ్యారు.

నేడు కూడా మన సమాజంలో కులాలలోని ఎక్కువ– తక్కువలు, కుమ్ములాటలు పూర్తిగా సమసిపోలేదు. ఇట్లుండగా ఇంచు మించు వెయ్యి సంవత్సరాలకు పూర్వమే కులభేదరహితమైన విశాలహృదయంతో ఆచార్యులవారు విలసిల్లారంటే వారి ఘనత ఎట్టిదో మాటలకందదు గదా!

ఒకసారి ధనుర్దాసుని చేయిని ఆలంబనం చేసుకొని మఠంవైపు నడుస్తూన్న ఆచార్యులవారిని చూచి శిష్యులు 'శూద్రస్పర్శ' తగునా అని ఆక్షేపించారు.

అప్పుడు ఆచార్యులవారు వారికి హితముపదేశించి విద్యామదం, ధనమదం, అభిజనమదం గర్వగ్రస్తులకు ఉంటాయనీ, సజ్జనులకవే వ్యత్యాసాలై దమాలుగా మారుతాయనీ బోధించారు. ధనుర్దాసులోని సౌజన్యం గ్రహించవలసినదిగా శిష్యులను హెచ్చరించారు. 'దమ'మంటే బాహ్యేంద్రియ నిగ్రహమని అర్థం.

అంతేకాక హేమాంబ ధరించిన ఆభరణాలు దొంగలింపజేసిన వృత్తాంతం ద్వారా శిష్యులకు ప్రత్యక్షంగా తక్కువ కులంవారైన ధనుర్దాస దంపతుల ఔన్నత్యాన్ని నిరూపించారు. కులగర్వం తగదని గట్టిగా హెచ్చరించారు.

సజ్జనులకు దుర్జనులు అకారణ శత్రువులుగా ప్రవర్తిస్తారు. శ్రీరామానుజుల సౌజన్యం వారి పట్ల పలువురికి శత్రుత్వం కల్గించింది. కాని వారి తపోమహిమ, సౌశీల్యం వారిని వైరివర్గం నుండి రక్షించాయి. ఆరోజుల్లో శైవవైష్ణవ భేదాలు చాలా తీవ్రంగా ఉండేవి. శైవులవల్ల ఆచార్యులకే కాక వారి అనుయాయులకు కూడా ముప్పు వాటిల్లే పరిస్థితులు సంభవించాయి. అయినా శ్రీరామానుజులవారు తమ అవతారకార్య నిర్వహణనుండి వైదొలగలేదు. నిశ్చితార్థాన్ని సాధించి విజయంతో వెలుగొందారు.

నేడు గూడ శైవులకూ, వైష్ణవులకూ గల భేదభావాన్ని ప్రస్తావిస్తూ శ్రీసద్గురు మలయాళస్వామివారు ఇలా వ్రాశారు – "శైవమతస్థులు అప్పుడు రామానుజాచార్యులకున్ను, తదనుయాయులకున్ను కలుగజేసిన ద్రోహముచే కాబోలు శ్రీవైష్ణవ సంప్రదాయములో కొందరికి శైవమందును, శివభక్తులయందును ద్వేషము గల్గినదని తోచుచున్నది. శ్రీరామానుజులు పరమైకాంతభక్తికి ఆధిక్యమిచ్చిరి. ప్రపత్తి వల్లనే జీవులకు వైకుంఠప్రాప్తి గల్గునని ఉపదేశించిరి. ఇది పరమభక్తిమతము"(–శ్రీధర్మసేతువు–259, 260 పుటలు)

శ్రీరామానుజాచార్యులు ముఖ్యంగా బోధించిన ప్రపత్తిమార్గంలో నడవడానికి వర్ణవ్యత్యాసం, కులభేదం, లింగభేదం – ఇత్యాదులు అడ్డు రావు. అందరినీ భగవదనుగ్రహానికి పాత్రులను కావించే ఉత్తమోత్తమ మార్గమిది. జనులెల్లరూ తరించడానికి అనువైన ప్రపత్తిమార్గాన్ని విస్తృతంగా ప్రచారం చేసిన ఆచార్యవర్యులను ఉద్దేశించి అన్నమాచార్యులవారు –

**గతులన్ని ఖిలమైన - కలియుగమందున**
**గతి యీతడే చూపె - ఘన గురుదైవము**

అని చెప్పి గురుత్వమూ, దైవత్వమూ మేళవించిన వారు శ్రీరామానుజార్యులవారని చక్కగా కీర్తించినారు.





తిరుమల శ్రీ పద్మావతి శ్రీనివాసుల పరిణయం
2016 మే 15 నుండి 17 వరకు



ధ్వజారోహణం



శ్రీసీతారాములకు దివ్యహారతి



పెండ్లికొడుకు ముస్తాబులో శ్రీరాముడు

# ఒంటిమిట్ట (కడపజిల్లా, ఆంధ్రప్రదేశ్), శ్రీకోదండరామస్వామివారి బ్రహ్మోత్సవం, శ్రీ సీతారామకల్యాణ దృశ్యమాలిక



ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం తరపున పట్టువస్త్రాలు సమర్పిస్తున్న గౌరవనీయులు ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబునాయుడు



శ్రీ సీతారామలక్ష్మణ దివ్యమూర్తులు



భక్తుల నృత్యహేల



శ్రీ సీతారాముల




గరుడవాహనంపై శ్రీ సీతారామలక్ష్మణులు



స్వామివారికి స్వర్ణకిరీటం సమర్పణ



శ్రీ సీతారాముల కల్యాణ వేదిక



శ్రీ సీతారాముల కల్యాణ సన్నివేశం



ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం తరపున పట్టువస్త్రాలు సమర్పిస్తున్న రాష్ట్ర గవర్నరు గౌరవనీయులు శ్రీ ఇ.ఎస్.ఎల్. నరసింహన్



కల్యాణ వేడుకలో భక్తులు



గౌరవనీయులు ముఖ్యమంత్రిగారి ఆధ్యాత్మిక సందేశం

# తిరుపతి శ్రీ కోదండరామస్వామివారి ఆలయంలో జరిగిన కల్యాణోత్సవ దృశ్యమాలిక


శ్రీ సీతారామలక్ష్మణులు


హోమనిర్వహణలో ఋత్విక్కులు


శ్రీ సీతారామ కల్యాణ సన్నివేశం


శ్రీ సీతారాములకు ముత్యాల తలంబ్రాలు


తి.తి.దే. తరపున ముత్యాల సమర్పణలో శ్రీకార్యనిర్వహణాధికారి


ఆశీస్సులు అందుకుంటున్న తి.తి.దే. అధ్యక్షులు


కల్యాణంలో పాల్గొన్న భక్తులు


స్వామి ఆశీస్సులు అందుకుంటున్న తి.తి.దే. ఉన్నతాధికారులు

# కైంకర్యమే.. తనువు దాల్చితే....

1

- డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478



**ఎందరో మహర్షులు, మహానుభావులు, మునులు, సజ్జనులు, కవులు, ఆచార్యులు మానవజాతికి సుగమ - సుందర సుఖమయ జీవితం ప్రసాదించడానికి తమ జీవితాలను కర్పూరంగా అర్పించారు. వారందరికీ వందనశతం. వాళ్లు తమ చింతన అధ్యయనం ద్వారా సిద్ధాంతాలను అక్షరీకృతం చేశారు. అంతేకాదు. ఆచరణ, ప్రచారం ద్వారా అనేక సందేశాలను అందించారు. వారి జీవితమే కరదీపిక! ఇది కలియుగం అయినా అనేకమంది జ్ఞానప్రదాతలు కారుచీకటి గర్భపు వెలుగురాసులు, అలాంటి జ్యోతిర్మయులలో ప్రధానులు ఆసూరిరామానుజాచార్య యతీంద్రులు.**

**యోనిత్యమచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ**
**వ్యామోహత స్తదితరాణి తృణాయమేనే ।**
**అస్మద్గురోర్భగవతోఽ_స్య దయైకసింధో!**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

*ఎవరు ప్రతిరోజూ చంచలత్వం లేకుండా భావస్థిరమైన నారాయణ పాదకమలాలపై వ్యామోహంతో, ఇతర విషయాలను గడ్డిపోచలాగా తేలికగా భావిస్తాడో, మనకాచార్యుడై దయా సముద్రుడైన భగవద్రామానుజాచార్యుల చరణకమలాలకు శరణు పొందుతున్నాను.*

అని అనేక విధాలుగా అసంఖ్యాక భక్తకోటిచే నిత్యం ప్రార్థింపబడుతూ, కీర్తింపబడుతూ, నిత్యశాంతి ప్రదాతయై ప్రకాశించిన సాక్షాత్తూ ఆదిశేషావతారం శ్రీరామానుజాచార్యులు.

. . .

మానవుడు దురాశాపరుడు. దుష్టచింతనుడు. తాను బ్రతకడు. తోటివానిని బ్రతకనివ్వడు. అభిమానం, ఆత్మీయత, స్నేహం, శాంతీ, మానవత కలిగించినా ఆ దైవీగుణాలను పాటించక దురుపయోగం చేస్తున్న మానవజాతిని దారిలో పెట్టాలని నిర్ణయించుకున్నాడు శేషశాయి. తల్లిదండ్రుల తర్వాత ఆచార్యుడు - గురువర్యుడే దేవుడు మానవులకు. అందువలన ఒక ఆచార్యుని భూలోకానికి పంపి మానవులకు ఉపదేశం చేయించాలనుకున్నాడు.

**ఉపదేశానికి స్వాంతం, సహనం, సమభావం, భూత దయ, ప్రేమ, కరుణ చాలా అవసరం. వాటిని వ్యక్తపరచేందుకు మధురవాక్కు, ఉపదేశ పరాయణత ఉండాలి.**

ఇవన్నీ శేషునిలో పరిపూర్ణంగా ఉన్నట్లు గుర్తించి శ్రీమన్నారాయణుడు అతణ్ణి భూలోకంలో ఆచార్యుడిగా అవతరించడానికి పంపాడు.

. . .

## తిరుమలనంబి - శ్రీశైలపూర్ణుడు

తిరుమల శ్రీవైష్ణవుల ప్రధాన దివ్యక్షేత్రాలలో అగ్రగణ్యం. తిరుమలనంబి పేరులోనే శ్రీనివాసుడు ఉన్నాడు. నంబి పరమ భాగవతులు. శ్రీవేంకటేశ్వరుని కైంకర్యానికే జీవితాన్ని అంకితం చేశారు. అరణ్యమైన తిరుమలనే నివాసం చేసుకున్నారు.

తిరుమలలో శ్రీవారి సన్నిధికి పాపనాశనం చాలా దూరం. నిత్యం స్వామి అభిషేకం పాపనాశన తీర్థ జలంతోనే జరుగుతుంది.

తిరుమలనంబి నిత్యం పాపనాశనానికి వెళ్లారు. వారికి శ్రమ అనిపించదు. స్వామి కైంకర్యమే మహదానందం. నీటి కుండ నెత్తికి ఎత్తుకొని కోవెలకు చేర్చేవాడు. పరమభాగవతోత్తముడైన తిరుమలనంబి శ్రమకు స్వామికి అలసట! స్వామి నంబి శ్రమను తీర్చదలిచారు. వేటబాలుడైనాడు. ధనుర్బాణాలు ధరించాడు. నంబి తీర్థం తెచ్చే దారిలో చెట్టునీడన కూర్చున్నాడు.

స్వామివారికి నంబి తీర్థం తెస్తున్నది చూచారు. స్వామి నంబిని 'దాహంగా ఉంది గుక్కెడు నీళ్లు పోయండిస్వామీ!' అన్నాడు.

'బాలకా! ఇది దివ్యజలం. స్వామి అభిషేకపు జలమిది. నీవు అడుగరాదు, నేనివ్వరాదు' అన్నాడు నంబి.

'తాతా! నీరు పోసి ప్రాణం రక్షించవా?' అడిగాడు.

'నీ దాహం తీర్చాల్సినవాడు భగవంతుడు. బాలకా! ప్రార్థించు, ఆతడే రక్షకుడు, ప్రాణరక్షకుడు. నాకు సమయాతీతం అవుతున్నదని' వేగంగా అడుగుసాగించాడు. స్వామి, కుండకు బాణం కొట్టాడు. దానికి చిల్లుపడింది. నీటి ధార సాగింది.

స్వామి దోసిటితో నీరు త్రాగసాగాడు.

కుండ తేలిక అయింది. తిరుమల నంబి తిరిగి చూచాడు.

బాలుని చేత బాణం! కుండకు రంధ్రం! చిల్లికుండ నుంచి చివరి నీటిబొట్టు! నంబి హతాశుడైనాడు. కూలబడ్డాడు. శ్రీస్వామికి అపచారం అని గొల్లుమన్నాడు. కన్నీరు కాలువ కట్టింది.

స్వామి నివ్వెరపోయాడు! ఎంతటి భక్తి! భాగవతుని కన్నీరు, భగవంతుని బాష్పమైంది.

"తాతా! లే! నీకు పవిత్రజలం చూపుతాను" అన్నాడు. నంబి చేయిపట్టుకుని లేపి, రెండేరెండు అడుగుల్లో కొండ చరియకు చేరాడు.



స్వామి బాణం ఎక్కుపెట్టాడు. కొండకు కొట్టాడు. మిరుమిట్లు మెరుపు! కొండనుంచి జలధార! ఆకాశగంగ!

తిరుమలనంబికి తెలివి వచ్చింది. జలధార! బంగారు బిందె. మరొకరు వినలేదు. కనలేదు. కాలాతీతం కాకూడదు. తీర్థంతో ఆలయానికి చేరుకున్నాడు. అక్కడివారు బంగారుబిందె చూచారు. అంతా చకితులయ్యారు. నంబి గమనించలేదు!

**భగవంతుడే తాత. 'తాత'చే 'తాతా' అని పిలిపించుకున్నాడు నంబి. నాటి నుండి 'తాత'గా పిలువబడ్డాడు నంబి. ఈ సంఘటనకు జ్ఞాపకార్థంగా 'తణ్ణీరముదు' (అమృతజలం) అనే ఉత్సవాన్ని యిప్పటికీ తిరుమల కొండమీద తిరుమలనంబి తిరునక్షత్రం రోజున జరుపుతారు.**

నాటి నుంచి ఆకాశగంగ తీర్థంతోనే శ్రీవేంకటేశ్వర స్వామికి అభిషేకం!

...

తిరుమల నంబికి ఇద్దరు చెల్లెళ్లు. భూమిపిరాట్టి, పెరియపిరాట్టి. వీరికే కాంతిమతి, శ్రీదేవి అని పేర్లు.

భూతపురి అనే శ్రీపెరుంబుదూరు సుందర గ్రామం. అక్కడ ఆసూరి కేశవసోమయాజి. వేద వేదాంగవేత్త. అతనికి కాంతిమతి నిచ్చి తిరుమలనంబి వివాహం చేశాడు.

ఈ దంపతులకు చాలా కాలం సంతానం కలుగలేదు. ఒకానొక సంపూర్ణ చంద్రగ్రహణం రోజు భార్యాభర్తలిరువురూ సముద్రస్నానానికి బయలుదేరారు. వారు పవిత్ర 'కైరవిణి' చేరుకున్నారు. సముద్రస్నానం చేశారు. అక్కడ పార్థసారథి స్వామి ఆలయం దర్శించి, స్వామిని సేవించారు, అర్చించారు.

కేశవాచార్య దంపతులు సంతానార్థులు గనుక ఆలయ ప్రాంగణంలో పుత్రకామేష్టి చేశారు. నిర్మల మనస్కులై ఆ రాత్రి ఆ ఆలయంలోనే నిద్రించారు. వేకువజాముననే కాంతిమతికి స్వప్నంలో పార్థసారథి స్వామిదర్శనం ఇచ్చాడు. "మదీయ దివ్యాంశంలో పుత్రుడు కలుగుతాడని" ఆశీర్వదించారు. కాంతిమతికి కలిగిన మధురభావనలు భర్తకు నివేదించింది. వారు మళ్లీ సముద్రస్నానం చేసి శుచిగా స్వామిని దర్శించారు.

...

కొంతకాలం గడిచింది. భూమిపిరాట్టి గర్భవతి అయింది. ఆమె మరింత కాంతిమతి అయింది. ఆమెకు రుచులు, కోరికలు చిగురించాయి.

ఆ ఇంట సంబరం కాపురం పెట్టింది.

కాంతిమతి గర్భం శుక్లపక్ష చంద్రునిలా పెరిగింది. వంపులు కనిపించలేదు. నడక భారమైంది. నవమాసాలు నిండాయి.

కల్యాబ్ద 4118 పింగళినామ సంవత్సరం, మేషమాసం, ఆర్ద్ర నక్షత్రం, (క్రీ.శ.1017) చైత్ర శుక్లత్రయోదశి, గురువారం, కర్కాటక లగ్నాన కాంతిమతి కుమారుని కన్నది.

అప్పుడు–

ఉ॥ **ఆ సమయంబునన్ మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్**
**సేసలు చల్లి రచ్చరలు; సిద్ధనికాయము చేరిసన్నుతుల్**
**సేసెఁ బ్రసూనసృష్టి గురిసెన్; జనరంజనకారి వాసనో**
**ల్లాసము లై చెలంగె శుభలక్షణ దక్షిణ గంధ వాహముల్**

**(మనుచరిత్రము 6-60)**

జీవితంలో బాల్యం మధురం. మధురం. మధురం. అది రంగులకల. పసితనాలమూట. అనుభూతుల అమృతభాండం.

బాల్యం మళ్లీరాదు. మన సంప్రదాయ సాహిత్యంలో పాలవెన్నెల చేలు కనిపించవు. మనకు తొమ్మిది ప్రధాన అవ తారాలు. ఒక్క శ్రీకృష్ణ బాల్యమే అక్షరబద్ధమైంది. ఆదిశంకరుల బాల్యపు ప్రధానాంశాలు మనదాకావచ్చాయి. రామానుజుల బాల్యం అదృశ్యం. వారు అసదృశులు జన్మతోనే జ్ఞానసూర్యులు. బాల్యపు ఘటనలు ఉండకపోవు! మనదాకా రాలేదు. అది మన దురదృష్టం.

కాంతిమతి పుత్రుడు శుక్లపక్షపు చంద్రునివలే వర్ధిల్లు తున్నాడు. మేనమామ తిరుమలనంబి అతనికి లక్ష్మణాచార్య అని నామకరణం చేశాడు. రామాయణంలో సుమిత్ర సౌమిత్రిని కనిన లగ్నంకూడా రామానుజ జనన ముహూర్తానికి సరి పడడంతో అతనికి లక్ష్మణ నామమివ్వడం జరిగింది.

లక్ష్మణాచార్య కంచి వరదస్వామి సమక్షంలో సన్యాసం స్వీకరించారు. అప్పుడు ఆ స్వామి రామానుజ ముని నామం ప్రసాదించారు. అయినా బాల్యం నుంచి రామానుజులుగానే ప్రస్తావిస్తున్నాం.

...

బాలరామానుజుడు పగలే వెన్నెల కురిపించారు!



కాంతిమతీ కేశవాచార్యులు పుత్రునికి ఉపనయన, చక్రాంకాది సంస్కారాలు చేయించారు. అవి కేవలం లాంఛ నాలు!

రామానుజులు జన్మతః జ్ఞాన భాస్కరులు.

కేశవాచార్యులు పుత్రవాత్సల్య పూర్ణులు. పుత్రునికి విద్యా బోధన ప్రారంభించారు. అదిశేషులకు విద్య! అది కేవలం మన భ్రమ!

యశోదకు ఆ పరమాత్మ తన నోట విశ్వదర్శనం చేయిం చాడు. అయినా ఆ మాతృమూర్తి అతన్ని చిన్నికృష్ణునిగానే భ్రమించింది. ఇదీ అంతే!

రామానుజులు ఏక సంథాగ్రాహి! తండ్రి చెప్పింది గడియలో ఒప్పగించేవారు. అతికొద్ది కాలంలోనే వేదవేదాం గాలు – పురాణాలు – శాస్త్రాలు సవ్యాఖ్యానంగా ఔపోశన పట్టారు.

తలలో నాలుకయై, పూసలలో దారంవలే గురువులకూ, సతీర్థ్యులకూ పరిచర్యలు చేస్తూ "రామానుజ!" అని రెండోసారి పిలిచేపనే లేకుండా చేతులు గట్టుకొని ముందు నిలచే వినమి తాంగుడుగా పేరు తెచ్చుకొన్నాడు.

అతనికి పదహారేళ్లువచ్చాయి. కాంతిమతీకేశవులు రామా నుజ - రక్షకాంబల వివాహం జరిపించారు (వధువు మరొక పేరు తంజమాంబ).

వధూవరులు ఇంకా మురిపాలలోనే ఉన్నారు. ఏదో పని తీరినట్లు - ఎవరో పిలిచినట్లు కేశవాచార్యులు పరమపదించారు. రామానుజులది సుతిమెత్తని మనసు. ఆర్ద్ర హృదయం. తండ్రి నీడ తొలగటం వారికి గొడ్డలి పెట్టయింది.

కాంతిమతికి ప్రాణం మాత్రం మిగిలింది. తుఫానుకు నేల గూలిన మహావృక్షంవలే ఆమె క్రుంగిపోయింది. కుమారు డనే ఆశాజ్యోతే ఆమె ప్రాణజ్యోతిని నిలబెట్టిందని చెప్పుకోవచ్చు.

రామానుజ కుటుంబం జన్మభూమి వదిలింది. వరదుని కాంచీపురం చేరుకుంది. కథలన్నీ కంచికి చేరుతాయనట్లు రామానుజుని కథా ఇప్పుడు కంచికే చేరింది. కంచి వరదరాజాలయం విశ్వవిద్యానిలయం. కాశీవలే జ్ఞానకేదారం.

రామానుజులు ఆదిశేష అంశ, అప్పటికే వేద-వేదాంగాలు వంటబట్టాయి. అంతేకాదు, వైష్ణవపరమైన అర్థాలు, వ్యాఖ్యలు మననం చేసుకున్నారు.

ఆ రోజుల్లో కాంచీపురంలో యాదవప్రకాశుడనే అసాధారణ ప్రజానిధి ఉండేవాడు. అతడు పేరు మోసిన అద్వైతసిద్ధాంతి. ఆయన కొంతమంది శిష్యులను చేర్చుకుని వైదికవిద్యను నేర్పేవాడు. అప్పటికి అద్వైతం సర్వవ్యాప్తమై, విద్య-విద్యాలయాలు అద్వైత అధీనాలు.

రామానుజులు విద్యకోసం కాకపోయినా - గుర్తింపుకోసం విద్యాలయం - గత్యంతరంలేక యాదవ ప్రకాశుని విద్యాలయంలో చేరారు. అతని పినతల్లి కుమారుడు గోవిందమిశ్రుడు కూడా అదే విద్యాలయంలో చేరాడు.

విశిష్టాద్వైతంలో భగవానుడు సర్వసుందరుడు. సుందర అలంకారభూషితుడు. సౌందర్యమే స్వామిరూపం. అద్వైతానికి - బ్రహ్మసత్యం. యాదవప్రకాశునివి అద్వైత వ్యాఖ్యలు. అవి రామానుజుని మనసును నొప్పించేవి. అయినా స్వతహాగా ఆయన శాంతమూర్తి గనుక ఆ వ్యాఖ్యలు దిగమింగేవారు. గురువును వ్యతిరేకించేవారు కాదు. మరీ మింగుడుపడనప్పుడు వినయపూర్వకంగా వివరించేవారు.

కానీ, తనకు మించిన శిష్యుని ఏ గురువూ సహించడు. అతనికి రానురాను రామానుజునిపై ప్రేమ సన్నగిల్ల సాగింది. రామానుజునికి కూడా తన మనస్తత్వానికి వ్యతిరేకార్థాలను చూపించే యాదవునిపై భక్తి క్షీణించసాగింది. ఈ క్రమంలో ఒకరోజు ఉదయం యాదవ ప్రకాశగురువులు శిష్యులకు బోధిస్తున్నారు. విషయం ఉపనిషత్తు. తైత్తిరీయం. ఒక శ్లోక భాగాన్ని బోధిస్తున్నారు.

**బ్రహ్మ విద్యాప్నోతి పరమ్॥ తదేషోభ్యుక్తాః**
**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ**
**యోనిహితం గుహాయం పరమే వ్యోమన్ ॥**
**సోశ్నుతే సర్వాన్ కామాన్ (తై.21)**

"సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మమే. హృదయాకాశం లోని బ్రహ్మను ఎరిగినవానికి సమస్త కోరికలు ఫలిస్తున్నవి" అని ఇలా అద్వైత పరమైన వ్యాఖ్యలు చేస్తుంటే రామానుజుడు ప్రతిఘటించి "సత్యం-జ్ఞానం-అనంతం బ్రహ్మానికి భూషణ ములేగానీ అవి బ్రహ్మంకానేరవని" స్పష్టపరిచాడు.

గురువులో సహనం నశించింది. "మళ్లీ ఇలాంటి విపరీ తార్థాలు ఆలోచించే పని పెట్టుకోకు, గురువును మించకు" అని లేచి వెళ్లిపోయాడు! అలా వెళ్లిపోయాడేగానీ ఈర్ష్య అతణ్ణి అంధకారంలోకి నెట్టేసింది. పగచిచ్చు రగిల్చింది! జీవితం సాంతం ప్రేమతో గడపవచ్చు! ద్వేషంతో గడియ గడపటం గగనం! కన్నుమూసినా, తెరచినా రామానుజుడు ఆకాశమంత వామనునిగా - తన తలమీద అడుగువేసి తొక్కుతున్న దృశ్యం! భయం- భయం- గుండెదడ - నోరు ఆరుకుపోతోంది! యాద వుడు నీళ్లు తాగాడు. కాని, దప్పితీరదు - కంటికి కునుకులేదు.

అంత శక్తివంతుడా? శిష్యుడు.

తాను అంత బలహీనుడా? ఇలాంటి ఆలోచనలతో గావుకేక పెట్టాడు. దిక్కులు పిక్కటిల్లాయి! శిష్యులు పరిగెత్తి వచ్చారు. గురువును చూశారు. అవాక్కయ్యారు. గురువు గుర్తించరానంత క్రుంగిపోయారు! తెలతెలవారుతున్నది. స్నానా నికి వేగవతికి సాగారు. యాదవ ప్రకాశుడు, విశ్వాసపాత్రులైన శిష్యులను కొంతమందిని సమావేశపరిచాడు. రామానుజుని వలన తమ సిద్ధాంత ఉనికికి ప్రమాదం ఏర్పడిందని రెచ్చ గొట్టాడు. యాదవ ప్రకాశుని సహితంగా దుష్ట శిష్యచతుష్టయం ఒక పథకం పన్నింది. అయితే, యాదవుడు, తన శిష్యగణంలో అతని సోదరుడు గోవిందుడు కూడా ఉన్నాడనే విషయాన్నే మరచిపోయాడు. తానొకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తాం దన్న స్పృహ లేకుండాపోయిందాతనిలో. అందులోని తొలి అధ్యాయం ప్రయాగయాత్ర! గురువర్యులు ఆదేశించారు. ఇదే మీ తెలీని రామానుజులు సిద్ధమైనారు. మాతృశ్రీ అనుమతి, భార్య వీడ్కోలు తీసుకున్నారు. బయలుదేరారు. *(ఇంకా ఉంది)*

ప్రస్తావన

**పుణ్యాంభోజ వికాసాయ**
**పాపధ్వాంత క్షయాయ చ ।**
**శ్రీమానావిరభూద్భూమౌ**
**రామానుజ దివాకరః ॥**

పుణ్యమనే పద్మాన్ని వికసింపజేయ డానికీ, పాపమనే చీకటిని పారద్రోలడా నికీ, ఆధ్యాత్మికమైన గొప్ప జ్ఞానసంపద గల్గిన శ్రీరామానుజుడనే సూర్యుడు ఈ భూమిపై అవతరించాడు.

**శేషావతార రూప మశేష**
**జనౌఘాఘహరణ చరణాబ్జమ్ ।**
**శ్రీ భాష్యకార మమలం కలయే**
**రామానుజం కృపాసింధుమ్ ॥**

ఆదిశేషుని అవతారంగా ఆవిర్భ వించినవాడు, లెక్కించడానికి వీలులేనంత మంది ప్రజల పాపాలను పటాపంచలు చేసిన ఆశ్రితచరణ కమలాలు గలవాడు, బ్రహ్మసూత్రాలను పరమపావనమైన భాష్య రచనచే 'శ్రీభాష్యకార' బిరుదు పొందిన వాడు, దయకు సముద్రమువంటి వాడైన శ్రీరామానుజుని శరణు పొందుచున్నాను.

## ఆదినారాయణుడే అందరికీ.... ఆదిగురువు

శ్రీవైష్ణవం శ్రీమన్నారాయణుడే పరతత్త్వంగా గలది. ఆయనకు ఐదు విధాలైన స్థితులు చెప్పబడినాయి. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా రూపాలు. శ్రీవైకుంఠంలోని నిత్యవిభూతినే పరము(శ్రేష్ఠము) అంటారు. అక్కడి స్వామివారిని 'పరవాసుదేవ మూర్తి' అంటారు. ఆయనకు శ్రీలక్ష్మీదేవి నిత్యానపాయిని. స్వామిని విడిచి ఎప్పుడూ ఉండదు. వారిది అవినా భావస్థితి. వారు నిత్యదంపతులు.

వారి నెవ్వరూ విడదీయలేరు.



# వెయ్యేండ్ల సూర్యుడు - వేయిపడగల శేషుడు

## భగవద్రామానుజాచార్యుడు (క్రీ.శ.1017-1137)

- డా॥ ముదివేడు ప్రభాకరరావు, 94418 72536

వ్యూహమంటే జీవుని ఆధ్యాత్మికంగా అభ్యుదయాన్ని కల్గించే ఒక క్రమపద్ధతి. పాంచరాత్రమనే ఆగమశాస్త్రంలో నాలుగు వ్యూహాలు చెప్పబడినవి. వాసుదేవ - సంకర్షణ - ప్రద్యుమ్న - అనిరుద్ధ మనేవి. ఈ వ్యూహాలు ఒకదాని నుండి మరొకటి పుడుతున్నాయి. ఒక జ్యోతినుండి మరొకజ్యోతి వెలిగింప బడినట్లుగా. 'వ్యూహ' శబ్దం 'హ్' అనే ధాతువునుండి పుట్టినది. 'వి' అనేది ఉపసర్గ. వి+ఉహ్= వ్యూహ. విశిష్టముగా ముందుకు త్రోయునది. ఇది జీవుని ఆధ్యాత్మిక పరిణామాన్ని సూచించే క్రమం. అంచెలంచెలుగా లోలోపల ఎదగడమే జీవుని పరిపక్వతను తెలియజేస్తుంది. ఈ ఊర్ధ్వగమనంలో ఆరుగుణాలు, మూడు జంటలుగా వెలికి వస్తాయని విశిష్టాద్వైతులు చెబుతారు.

నిజానికి ఈ నాల్గు వ్యూహాలు మొదటిదైన వాసుదేవ వ్యూహంలో ఆరు గుణాలచేత నిండి ఉన్నప్పటికీ, తక్కిన మూడు వ్యూహాలైన సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహాలలో రెండు, రెండు గుణాలుగా ప్రాధాన్యం వహించి ఉంటాయి.

వాసుదేవ వ్యూహంలోని ఆరుగుణాలివి. **జ్ఞాన, ఐశ్వర్య, శక్తి, బల, వీర్య, తేజస్సులు.** ఈ వ్యూహము సర్వాధికమైనది. షడ్గుణవిశిష్టుడు వాసుదేవుడు కనుక, ఆయనకు షాడ్గుణ్య విగ్రహుడు లేదా షాడ్గుణ్య ప్రపూర్ణుడు అంటారు.



సంకర్షణ వ్యూహంలో జ్ఞాన, ఐశ్వర్యగుణాలు, ప్రద్యుమ్న వ్యూహంలో శక్తి, బలాలు, అనిరుద్ధవ్యూహంలో వీర్య తేజస్సు లుంటాయి. ప్రతియొక్క వ్యూహంకూడా భగవత్తేజ సమన్వితమే! ఈ సందర్భంలో శ్రీరామానుజులవారు కొంత విశేషాన్ని కూడా కల్పించారు. వారి ప్రకారం సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహాలు జీవులను పాలించేవి. అంటే, జీవుల జీవలక్షణాన్ని పరిపాలించేవి. సంకర్షణుడు ప్రధానంగా జీవుడు. ప్రద్యుమ్నుడు మనస్సు. అనిరుద్ధుడు అహంకారం.

సంకర్షణుడు లయకారకుడు. వేదాలు ఆయననుండే ఆవిర్భవించాయి. ప్రద్యుమ్నుడు సృష్టికర్త. ఆయనవల్లనే ధర్మాలు ప్రపంచింపబడుతున్నాయి. అనిరుద్ధుడు అహంకారమూర్తి. అంటే అహంకారప్రాధాన్యం గల్గిన జీవసంపుటికి అధినేత. ఈ విధంగా నారాయణుడు ఒక్కడే దైవమని విశిష్టాద్వైతం ప్రతి పాదిస్తున్నది. దీని మూలబీజం సంకర్షణ వ్యూహగతమై ఉన్నది. ప్రద్యుమ్నుడు క్రియామూర్తి. అనిరుద్ధుడు క్రియాఫల ప్రదాత.

సంకర్షణ వ్యూహం మూలబీజం అనడంలో ఒక గొప్ప సృష్టిరహస్యమే యిమిడి వున్నది. 'తైత్తిరీయ సంహిత' (3-1-1-1)లో ప్రజాపతి యొక్క 'దీక్షితవాదం' గురించి చెప్పబడింది.

## సృష్టిలో తొట్టతొలి జీవుడు ఆదిశేషుడే

సంకర్షణుడు ప్రధానంగా జీవుడని, సృష్టిమూల బీజం సంకర్షణ వ్యూహగతమై ఉన్నదని పాంచరాత్ర ఆగమం చెప్పిన అంశం వైదిక సృష్టి రహస్యానికి ప్రోద్బలకమైనదే. తైత్తిరీయ సంహితలోని బ్రహ్మసుదీర్ఘ తపోదీక్షను పొంది తొట్టతొలిసారిగా సర్పాలను, మలి సృష్టిలో పక్షులను, మూడవసారిగా చరాచర ప్రకృతితో పాటు స్త్రీ పురుషులను సృష్టించాడని చెప్పబడింది. బ్రహ్మసృష్టిలోని తొట్టతొలి సర్పం ఆదిశేషుడే. ఆయనయే అనంతుడు. ఆయనకే సంకర్షణుడనిపేరు. సంకర్షణుడనగా బలరాముడు.

**ఆదిశేషుడే కలియుగంలో శ్రీరామానుజుడుగా అవతరించాడు.**

**అనంతః ప్రథమోదేవః ద్వితీయో లక్ష్మణస్తథా ।**
**తృతీయో బలభద్రస్తు కలౌకశ్చిద్భవిష్యతి ॥**

అని సంప్రదాయశ్లోకం. కృతయుగంలో అనంతుడు (ఆదిశేషుడు)గా, త్రేతాయుగంలో లక్ష్మణస్వామిగా, ద్వాపర యుగంలో బలరాముడుగా, కలియుగంలో ఎవరో ఒకరుగా అవతరిస్తారని రామానుజులు పుట్టకముందే నమ్మాళ్వారు భవిష్య దాచార్య విగ్రహాన్ని నాథమునులకు అనుగ్రహించారు. అది యామునాచార్యుల అనంతరం శ్రీరంగపీఠాధిపతులైన రామాను

జులకాలంలో నమ్మాళ్వారువాణి ఫలించిందని శిష్యులు సంతోషించారు. ఈ నిశ్చితాభిప్రాయమే **"భజయతిరాజ స్తోత్రమ్"**లో వేదాంతం రంగనాథాచార్యులవారు రూఢిపరిచారు.

**ఆదౌ జగదాధారశ్శేషః, తదను సుమిత్రానందన వేషః ।**
**తదుపరి ధృతహల ముసల విశేషః, తదనంతర మభవద్గురురేషః ॥**

కృతయుగంలో (సృష్ట్యాదిలో) జగత్తుకు మూలాధారంగా పాతాళలోకంలోని ఆదిశేషుడే, త్రేతాయుగంలో సుమిత్ర కొడుకు లక్ష్మణుడుగా, ద్వాపరయుగంలో నాగలిని, రోకలిని చేబట్టిన బలరాముడుగా, కలియుగంలో జగద్గురువు రామానుజులుగా అవతరించారని స్పష్టీకరించారు.

సంస్కృత మహాభాగవతపురాణం- పంచమ స్కంధం-17వ అధ్యాయంలో పురుషోత్తముడైన నారాయణుని నాల్గవ మూర్తికి సంకర్షణుడని పేరు. **"ఓంనమో భగవతే మహాపురుషాయ సర్వగుణ సంఖ్యానాయాఽ ఽనంతాయాఽ వ్యక్తాయ నమ ఇతి"** అని సంకర్షణ మంత్రం చెప్పబడింది. భగవచ్ఛబ్దానికి ప్రతీక ఓంకారం. పురుషోత్తముడైన సంకర్షణుడే త్రిగుణ కార్యమైన జగత్తుకు చైతన్యప్రకాశమును అగ్రహిస్తున్నాడు. అనంతుడగు ఆయన ఇంద్రియాలకు కనబడడు. ఆయనకు అనేక నమస్కారములు. (శ్లోకాలు-16-17).

"జగత్తు యొక్క సృష్టి స్థితిలయములను చేసేవాడు అనంతుడేనని, అయితే ఆయన సత్త్వరజస్తమోగుణాలకు అతీతుడని", మహర్షులు, దేవమాతయైన అదితి చెబుతున్నారు. వేదమంత్రాలు ప్రతిపాదించాయి. ఆయన వేయిపడగలపై ఏదో ఒకమూల భూమండలం ఆవగింజవలె ఉన్నది. అది ఉన్న సంగతి కూడ ఆయనకు జ్ఞప్తిలో ఉండదు. అంటే అంత అలవోకగా, అవలీలగా భూభారాన్ని ఆవగింజగా మోస్తున్న ఆదిశేషుడే సంకర్షణుడు.

సంస్కృత భాగవత మహాపురాణం -పంచమస్కంధం-25వ అధ్యాయంలో **"శ్రీసంకర్షణ దేవునిస్తోత్రం"** ఉన్నది. "పాతాళానికి ముప్పైవేల యోజనాల దూరంలో మూలస్థానంలో శ్రీహరి భగవానుని తమోగుణ ప్రధానమైన కళ ఉన్నది. దానికి అనంతుడని పేరు. ఇది అహంకారారూపం కావడంచే ద్రష్ట - దృశ్యాన్ని ఏకం చేస్తుంది. సత్త్వగుణ ప్రధానుడైన శ్రీహరిని కొలిచే భక్తులు ఈ కళను సంకర్షణుడు (ఏకం చేసేవాడు)- అని వ్యవహరిస్తారు.



వేయితలల అనంతుని రూపంలో ఉన్న భగవానుని ఒకే ఒక తలపై మోయబడే ఈ భూమండలం అక్కడ ఆవగింజవలె కనబడుతుంది.

ప్రళయకాలంలో ఈ జగత్తును ఉపసంహరించగోరే సంకర్షణుడు కోపంతో అందమైన కనుబొమల్ని విరిచి తిప్పగా, వాటి మధ్యనుండి ముక్కంటి రుద్రుడు ఆవిర్భవించాడు. పదకొండురూపాలుగల ఆయనకు సాంకర్షణుడు (సంకర్షణుని నుండి పుట్టినవాడు) అనే పేరు ప్రసిద్ధి కెక్కింది. ఆ రుద్రుడు త్రిశూలాన్ని ఎత్తిపట్టుకొని ఉంటాడు.

సంకర్షణుడు లోకకల్యాణకారకుడు కూడా. నాగలిపై భాగాన్ని తన సుకుమారమైన అందమైన భుజంపై ఉంచి ఉండేవాడు. అనంతుడు 'వైజయంతి' అనే అడవి పూలమాలను ధరించి, మహేంద్రుని 'ఐరావతం' కాలికి కట్టే బంగారు గొలుసును మెడలో ధరించి ఉంటాడు.

మోక్షాన్ని కోరే సాధకులు అనంత భగవానుని గురించి విని, ఆయనను ధ్యానిస్తే, భక్తుల హృదయంలోపల సాక్షాత్కరించి అజ్ఞానరూపంలో ఉండే హృదయపు ముడిని శీఘ్రంగా నిర్మూలిస్తాడు. వేయి తలలుగల ఆదిశేషుడే అనంతుడు. ఆయన పరాక్రమానికి హద్దులు లేవు. వేయినాల్కలు గలవాడైన ఆయన గొప్పతనాన్ని ఎవ్వరూ సంపూర్ణంగా వర్ణించ లేరు."

ఆదికవి నన్నయభట్టు వ్రాసిన ఆంధ్రమహాభారతం ఆది పర్వంలోని ఉదంకోపాఖ్యానంలో అనంతుడైన ఆదిశేషుని స్తుతి నాల్గు వృత్తాలలో **"అనంతుడు మాకు ప్రసన్ను డయ్యెడున్"** అనే మకుటంతో చాల రమణీయంగా వర్ణించారు.

## 2016 జూన్ నెల ఉత్సవాలు

**జూన్ 14 నుండి 23 వరకు**
**శ్రీప్రసన్నవేంకటేశ్వరస్వామి వారి బ్రహ్మోత్సవాలు,అప్పలాయగుంట**
**జూన్ 15 నుండి 19 వరకు**
**శ్రీపద్మావతి అమ్మవారి తెప్పోత్సవాలు, తిరుచానూరు**
**జూన్ 17 నుండి 19 వరకు**
**తిరుమల శ్రీవారి జ్యేష్ఠాభిషేకం**

ఈ నేపథ్యంలో 'రామానుజ-ఆదిశేష' నామధేయాలను విశ్లేషించి, సమన్వయిస్తే రామానుజనామ సార్థక్యం తెలుస్తుంది.

అ) ఆది+శేష= ఆదిశేష
ఆ) రామ+అనుజ= రామానుజ

ముందుగా **'ఆదిశేష'** శబ్దాన్ని వివేచించుకొందాం!

**'ఆది'** అంటే "సృష్టియొక్క 'ఆది'లో జన్మించి"
**'శేష'** ప్రళయకాలం చివరి వరకు మిగిలి ఉండేవాడు.

'నిత్య' శబ్దానికి మరణంలేనివాడని అర్థం! స్వామికి లక్ష్మీదేవివలె 'అనపాయనులై' నిత్యసేవలో మునిగి ఉండేవారు. సృష్టిలో ఎన్ని కల్పాలు, మన్వంతరాలు, జలప్రళయాలు జరిగినా వారికేమీ సంబంధంలేదు.

'రామ', 'ఆది' శబ్దాలు రెండూ ఆదినారాయణ తత్త్వానికి చెందినవి. సృష్ట్యాదిలోని ఏకైక తత్త్వమే ఆది. దీనికే ఆదినారాయణ తత్త్వమంటారు. అంటే నారాయణుడు ఒంటరిగా ఉన్నప్పటి తత్త్వం. 'రామ' తత్త్వం అనాది. అంటే తోడుగా స్త్రీని సృష్టించుకొన్న తర్వాత ఏర్పడిన తత్త్వం. ఈ సంసారము, సృష్టి - అనాది. ఒకటి ఆది, రెండవది అనాది. ఏకైక తత్త్వం ద్విధా విభక్తమైనప్పుడు ఏర్పడిందే అనాదియైన రామతత్త్వం.

ఈ ఆది - అనాది తత్త్వాల సమన్వయానికే **'రామ'** అని పేరు. (**'రామా'** యని స్త్రీకి పేరు, **'రామా'** అని బ్రహ్మమునకు పేరు) స్త్రీ పుంస యోగోద్భవమైన సంసార (ప్రపంచ) తత్త్వం పేరే రామతత్త్వం.

**'రామ'** శబ్దానికి **'అనుజ'** శబ్దాన్ని చేర్చినప్పుడు **'రామానుజ'** అవుతున్నది. అంటే ఆది - అనాదియైన రామతత్త్వాన్ని అనుసరించి ఉండేది. ఆ తత్త్వానికి అనుగుణంగా వ్యాఖ్యానింపబడేది. అని అర్థం! 'అనుజ'దనగా తమ్ముడు. తమ్ముడెప్పుడూ అన్నను అనుసరించి వెళ్ళడం లోకసహజం. అన్న రాముడు, తమ్ముడు లక్ష్మణుడు రామునితో 'రామ'యైన సీతమ్మ కూడ ఉన్నది. అదే 'అనపాయిని'మైన లక్ష్మీతత్త్వం. అనగా సీతా రాములను అనుసరించి వెళ్లేవాడని అర్థం. రామాయణ కథలో ఇలాగే జరిగింది. **"రామున్, రామను కొల్చుచున్ చనుమురా రామానుజా! లక్ష్మణా!"** అని కవిసమ్రాట్ విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షంలో అగస్త్యమహర్షి లక్ష్మణునితో చెప్పినమాట. **"ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థోఽను ధావతి"** అని లక్ష్మణస్వామి యొక్క రామానుజ తత్త్వాన్ని వ్యాఖ్యానిస్తూ ఉంది.

రామయైన సీతాదేవి తత్త్వాన్ని రాముడైన విష్ణుతత్త్వాన్ని వేయి ముఖాలుగా వ్యాఖ్యానింపగల సామర్థ్యంగల ఓ లక్ష్మణ స్వామీ! రామానుజా! ఈ నిత్యదంపతుల తత్త్వాన్ని సేవిస్తూ అనగా వ్యాఖ్యానిస్తూ **'రామానుజు'**డనే పేరును సార్థకం చేసుకోవయ్యా! అని ఋషివాక్యంలోని అంతరార్థం! కలియుగంలో లక్ష్మణుడే **'రామానుజుడు'**గా విష్ణుతత్త్వాన్ని వ్యాఖ్యానించే ప్రస్థానత్రయభాష్యం వ్రాయబోతాడన్న రహస్యాన్ని ధ్వనిగర్భితంగా పల్కిన ఋషివాక్కుకు అన్యథాత్వం లేదు. వైకుంఠంలో శ్రీలక్ష్మీనారాయణతత్త్వం. అవతారవేళల్లో సీతారామతత్త్వం. రుక్మిణీశ్రీకృష్ణతత్త్వం - ఇలా విష్ణుతత్త్వం ఆయా యుగాల్లో వ్యాఖ్యాతమౌతున్నది. ఆది+శేష శబ్దాల నుండియే శేష-శేషి తత్త్వం పుట్టింది.

అ) భగవంతుడు - శేషి, తత్త్వము - రాముడు (పరబ్రహ్మము)
ఆ) జీవుడు - శేషుడు, వ్యాఖ్యాత - రామానుజుడైన ఆదిశేషుడు (లక్ష్మణస్వామి)

అన్నమయ్య అన్నట్లు 'ఆది'కి 'అనాది'యైన అర్చావతారమే రామతత్త్వం.

**'రామ'** శబ్దం **'శేషి'** కాగా, **'అనుజ'** శబ్దం **శేషుడు.**
**'ఆది'** శబ్దం **'శేషి'** కాగా, **'శేష'** శబ్దం **జీవుడు.**

ఈ దృష్టితో విశ్లేషించి సమన్వయిస్తే, 'రామానుజ' నామధేయంలోనే 'ఆదిశేష' తత్త్వం అంతర్భవించి శ్రీరామానుజుల విశిష్టాద్వైతతత్త్వమూ, సిద్ధాంతమూ రెండూ ఏకత్ర సమన్వితమై ఉన్నాయని తెలుస్తుంది.

భగవద్రామానుజులు విష్ణుతత్త్వవ్యాఖ్యాతగా ఆదిశేషుని అంశలో 120 సంవత్సరాలు ఈ భూమిపై జీవించి విష్ణువే పరతత్త్వమని చెప్పే శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని పునాదిగాచేసి విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులయ్యారు.



# ధనుర్దాసు

- శ్రీ కట్టానరసింహులు,
94413 37542

తమిళనాడులోని కావేరీనదీతీరంలో శ్రీరంగం ఉంది. ఆ నగరంలో రంగనాథుడు వెలసి భక్తులకు కొంగుబంగారమై ఉన్నాడు. ఆ శ్రీరంగానికి సమీపంలో నిచుళాపురం అనే ఊరుంది. ఆ ఊళ్లో ఆయుధవిద్యలు నేర్చిన దాసకుటుంబం ఒకటి. ఆ కుటుంబంలో ఒక బాలుడు జన్మించాడు. ఆ పిల్లవాడు ధనుర్మాసంలో జన్మించినాడని తల్లిదండ్రులు వానికి ధనుర్దాసు అని పేరు పెట్టారు. ఆ పిల్లవాడు పెరిగి యుక్తవయస్సుకు వచ్చాడు. యౌవన పరిపుష్టి కలిగిన శరీరంలో అందచందాలు తొణికిసలాడుతున్నాయి. వయస్సు వచ్చినదని తలిదండ్రులు పొన్నాచ్చి- అనే అమ్మాయిని తెచ్చి పెండ్లి చేశారు. ధనుర్దాసుకు తగిన జత పొన్నాచ్చి. అందచందాలలో అతనికి మించి ఆమె కన్నులున్నాయి. ఆమె కంటి సోయగానికి ధనుర్దాసు ఆమెకు వశమైపోయాడు. ఎల్లవేళలా ఆమెను ఆమె కంటి అందాన్ని కాపాడుకొంటూ ఉన్నాడు.

కొత్తదంపతులు కొంతకాలం ఒంటరిగా గడపడం మంచిదనుకొన్నారు తల్లిదండ్రులు. ఎటైనా వెళ్లి కొన్ని రోజుండి రండని కొడుకును కోడలిని అనుమతించారు. తలిదండ్రులు ఇచ్చిన స్వేచ్ఛకు ధనుర్దాసు సంతోషించాడు. పొన్నాచ్చిని వెంట బెట్టుకొని శ్రీరంగం చేరుకొన్నాడు. అక్కడ ఒక బస ఏర్పాటు చేసుకొన్నారు. ఆ నవదంపతులిద్దరు ఉదయం కావేరికి స్నానానికి వెళ్తారు. తిరిగి వచ్చే వేళకు సూర్యోదయ మవుతుంది. ఆ చిట్టెండకు తన భార్య సొగసు తరుగుతుందని ధనుర్దాసు గొడుగుపట్టి నడుస్తాడు. ముఖ్యంగా తన ఇల్లాలి కనుదోయి వాడిపోతుందేమోనని భయం. ఇలా ఆ కొత్తదంపతులు నడుచుకొంటున్న తీరు ఊరంతా గుప్పుతుంది.

ఒకనాడు ఆ యువదంపతులు కావేరినుంచి శ్రీరంగం ఆలయం తిరువీథిగుండా నడుస్తున్నారు. హఠాత్తుగా భగవద్రామానుజులవారు వారికి ఎదురుగా నిలబడ్డారు. ధనుర్దాసు భుజం తడిమి అనునయించారు. నీ కోసమే ఇన్నాళ్లుగా ఎదురు చూస్తున్నాను. ఈ చిన్నారి పొన్నాచ్చి పట్ల నీకున్న గాఢాభిమానం నాకు తెలుసు. ఆమె కంటి అందం కాపాడుకొంటున్నావు. నశించిపోయే శరీరంలో ఆ అందం ఎంతోకాలం నిలవదు. మీరిద్దరూ నా వెంటరండి. తరిగిపోని కన్నుల సౌందర్యం మీకు చూపిస్తాను అన్నారు. ఆ దంపతులిద్దరు రామానుజులవారి వెంటనడిచారు. వారిని రామానుజులవారు శ్రీరంగనాథుని ఆలయానికి తీసుకువెళ్లారు. స్వామి ఎదుట నిలబెట్టారు.

ధనుర్దాసు తలపై రామానుజులు తన చేతినుంచారు. తరువాత తన కమండలంలోని నీటితో ధనుర్దాసు కళ్లు తుడిచారు. శ్రీరంగనాథుని తదేక దృష్టితో చూడమన్నారు. ధనుర్దాసు అట్లే చేశారు. శ్రీరంగనాథుని పద్మాల్లాంటి కన్నులనుండి దేదీప్యమానమైన వెలుగులు ప్రసరిస్తున్నాయి. తన ఇల్లాలి కంటి అందంకంటె మాటల్లో చెప్పలేని అందాన్ని ధనుర్దాసు ఆ రంగనాథస్వామి కన్నుల్లో చూశాడు. భగవద్రామానుజులు తిరిగి ధనుర్దాసు కన్నులు తుడిచాడు. ధనుర్దాసు ఆ స్మృతినుండి బయటకు వచ్చాడు. రామానుజులతో ఇలా అన్నాడు. స్వామీ! నా కన్నులు తెరిపించారు. సంసారచక్రం నుంచి తప్పించి జన్మ రాహిత్యాన్ని ప్రసాదించగల ఆ వెలుగుల్ని తనివితీరా చూశాను అన్నారు. నన్ను నమ్మి నా వెంటవచ్చిన పొన్నాచ్చినీ కనికరిం



చండి అన్నారు, రామానుజాచార్యులు ధనుర్దాసును శిష్యుడుగా స్వీకరించారు. దంపతులిద్దరికి చక్రాంకనం చేశారు. వారు ప్రతి రోజు రామానుజులవారి మఠానికి వెళ్లి స్వామిని సేవిస్తూ వస్తున్నారు.

రామానుజులవారు స్నానానికి కావేరికి వెళ్లేటప్పుడు ఇతర శిష్యులవెంట నడిచేవారు. స్నానం అయి తిరిగి రంగధామానికి బయలుదేరేటప్పుడు ధనుర్దాసు భుజంమీద చేయివేసి నడిచేవారు. తమను ఒకవిధంగా ధనుర్దాసును ఒకవిధంగా చూస్తున్న గురువుగారిపట్ల శిష్యుల మనస్సులు మారాయి. గురువుగారి ప్రవర్తన శిష్యులకు కంటగింపుగా తోచింది. రామా నుజులవారు శిష్యులకు బుద్ధి చెప్పి దారికి తేవాలనుకున్నారు.

బ్రాహ్మణత్వమన్నా, శూద్రత్వమన్నా శరీరానికి సంబంధించికాదని, ఆత్మగతమని రామానుజులు తెలియజెప్పారు.

ఒకనాటి ఉదయానికి శిష్యులు ఆరవేసుకొన్న కావి పంచెలు పేలికలయి ఉన్నాయి. నీవు చించావంటే నీవు చించావనుకొంటూ ఒకరినొకరు పోట్లాడుకొన్నారు. ఒకడైతే ఖడ్గం తీసుకొని మరొకని తల తెగవేసేందుకు సిద్ధమయ్యాడు. రామానుజులవారి అదలింపుతో రొద సద్దు మణిగింది. అందరికి కొత్త కావివస్త్రాలు తెప్పించారు రామానుజులవారు.

కొన్ని రోజులు గడచినమీదట రామానుజులు కొందరు శిష్యుల్ని తనవద్దకు పిలిపించుకొన్నారు. నేను చెప్పిన పని బయటకు పొక్కనీయకుండా చేయాలి అన్నారు. ఆ శిష్యులు చిత్తం అన్నారు. ఈ రాత్రి ధనుర్దాసు ఇంటికి వెళ్లి – పొన్నాచ్చి ఒంటి మీది నగలు దోచుకొనిరావాలి అన్నారు. శిష్యులు ఒక్కక్షణం ఆశ్చర్యపడ్డారు. గురువుగారి ఆజ్ఞ కదా! సరే అన్నారు. శిష్య చోరులు ధనుర్దాసు ఇంటి గోడదూకి లోనదూరారు. దంపతులిద్దరు గాఢనిద్రలో ఉన్నారు. పొన్నాచ్చి కుడివైపు ఒత్తిగిలి పండుకొని ఉంది. శిష్యులు ఒక్కటొక్కటి ఒంటిమీది నగలు ఒలిచారు.

ఈలోగా పొన్నాచ్చి కదిలింది. ఏదో అలికిడి అయినట్లై కండ్లు కొద్దిగా తెరచి చూచింది. తన చుట్టూ మనుషులు, వారి చేతుల్లో తన నగలు, ఆ మనుషులెవరోకాదు, ఊర్ధ్వపుండ్రాలు ధరించిన వైష్ణవ భక్తులు. ఒక్కక్షణంలో ఆమెకు అర్థమయింది. ఆ వైష్ణవులకు నా నగలు కావాలి. తన ఒంటి మీద మరికొన్ని నగలున్నాయి. వాటిని కూడా వారికి అందేలా చేయాలి. వైష్ణవులకీ ఉపకారం చేయడం తన ధర్మమనుకొన్నది. పొన్నాచ్చి ఎడమవైపు ఒత్తిగిలి పరుండింది. ఆమె మేలుకొంటుందన్న భయంతో శిష్యచోరులు గోడదూకి వెళ్లి పోయారు.

ఆ ఉదయం పొన్నాచ్చి కన్నుల నీరు గుక్కుకొంటూ కొంగుముడిలో బంగారు నగలతో వచ్చి రామానుజులవారి పాదాలమీద వ్రాలింది. రాత్రి తన ఇంటికి వైష్ణవ దాసులు వచ్చారని తన మేని నగలు ఒకవైపు ఒలుచుకొన్నారని, రెండవప్రక్క నగలు తీసుకునేందుకు వీలుగా ప్రక్కకు కదిలానని ఇంతలో వారు వెళ్లిపోయారని ఏడుస్తూ చెప్పింది. వైష్ణవులకు అపచారం చేశానని నాథుడు తన మొగం చూడలేదని వలవలబోయింది. ఇంతలో ధనుర్దాసు వాడిపోయిన మొగంతో వచ్చి స్వామి పాదా లపై వ్రాలాడు.

రామానుజులవారు ధనుర్దాసు దంపతుల్ని ఓదార్చారు. హరిభక్తులకు దొంగలవల్ల భయం లేదన్నాడు. ఇదంతా నేను కల్పించిందే అన్నాడు, ధనుర్దాసు పొన్నాచ్చి ఒకరి మొగం ఒకరు చూచుకొన్నారు.

తక్కిన శిష్యులందరు విస్మయంతో చూస్తున్నారు. జ్ఞానికి శూద్రత్వం అంటదు. మనస్సుకు మైలపట్టినవారు బ్రాహ్మణులైనా శూద్రులే. ఈ మఠంలో బ్రాహ్మణుల మనుకొనేవారి కన్నులు తెరిపించడానికే ఈ పనిచేశాను, గోచి పాత చినిగిందని గొంతులు తెంచుకొనేదాకా సిద్ధమయ్యారు. కొత్త కావిగడ్డలు తెప్పిస్తున్నాననగానే కీచులాటలు మాయమయ్యాయి. తన మేనిమీది నగలు సగమే అర్పించగలిగితినే అని పొన్నాచ్చి దిగులు. నీకింకా శరీరభ్రాంతి తొలగలేదు. ఆ వైష్ణవదాసులు నిన్ను కదిలించి తమపని పూర్తి చేసుకొని వెళ్లేవారు కదా – అని ధనుర్దాసు ఆవేదన.

శిష్యులూ – మీకూ ధనుర్దాసుకూ ఉన్న తేడా తెలిసి వచ్చింది గదా! స్నానానికి వెళ్లేముందు మిమ్మల్ని తోడుగా; గుడికి వెళ్లేముందు ధనుర్దాసును తోడుగా ఎందుకు తీసుకు వెళ్లేవాడినో తెలిసిందా! అన్నారు. బ్రాహ్మణత్వమన్నా, శూద్రత్వమన్నా శరీరానికి సంబంధించికాదని, ఆత్మగతమని తెలిసి శిష్యులు తప్పు తెలుసుకొన్నారు. పొన్నాచ్చి ధనుర్దాసులు స్వామి సేవలో లీనమయ్యారు.





# శ్రీనివాసుడు భగవద్రామానుజులు


- డా॥ కె.రాజగోపాలన్,
90528 36164


**యో నిత్యమచ్యుత పదాంబు జయుగ్మరుక్మ**
**వ్యామోహతః తదితరాణి తృణాయ మేనే ।**
**అస్మద్గురోః భగవతోఽ స్య దయైక సింధోః**
**రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥**

భగవంతుని శ్రీచరణాలను ప్రతినిత్యం స్మరిస్తూ ఇతరములైనవాటిని తృణప్రాయంగ పరిత్యజించిన దయైక సింధువు రామానుజాచార్యుల చరణద్వంద్వమును ఆశ్రయిస్తున్నాను.

రామానుజాచార్యులు సకలచరాచర ప్రాణికోటికి భగవత్సా యుజ్యాన్ని అందించాలన్న మహాసంకల్పంతో అనేకానేక గొప్ప కార్యాలను నిర్వర్తించిన ఆచార్యులు. ఎంతో కష్టపడి గురువు యొక్క ఆదేశాలను విస్మయపరుస్తూ అష్టాక్షరీ మంత్రోపదేశాన్ని పొంది తన తల వేయి ముక్కలైనా పర్వాలేదుకానీ ప్రతి ప్రాణి మోక్షాన్ని పొందాలన్న ఉద్దేశ్యంతో దేవాలయ రాజగోపురాన్నెక్కి మంత్రాన్ని బిగ్గరగా పలికిన సకలజనోద్ధారకులు రామానుజులు.

రామానుజాచార్యులకు తిరుమల-తిరుపతి క్షేత్రాలతో ఎంతో అనుబంధం ఉంది. యుగయుగాలనాటి క్షేత్రం తిరుమల. చతుర్యుగ క్రమంలో అనేకయుగాలు గడిచిన కాలంలో కలియుగంలో తిరుమల క్షేత్రంలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆవిర్భవించారని పురాణాల ద్వారా తెలుస్తోంది.

దశరథ చక్రవర్తి తిరుమలక్షేత్రాన్ని సందర్శించినట్లు, పాండవులు ఈ క్షేత్రానికి వచ్చినట్లు శ్రీవేంకటాచల మాహాత్మ్యంలో పేర్కొనబడి ఉన్నది.

అంటే పూర్వైన ఎన్నో చతుర్యుగాల చక్రంలో శ్రీవేంకటేశ్వరుడుగా కలియుగంలో కన్యా మాసంలో శ్రవణనక్షత్రం రోజున అవతరించారన్నది పురాణాలలో పేర్కొనబడి ఉన్నది.

కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధిని పొంది కోరినవారికి కోరిన కోర్కెలను తీర్చే స్వామిని ఆళ్వార్లు తమ అంతరంగ నేత్రాలతో దర్శించి అనేకానేక మంగళాశాసన పాశురాలను కీర్తించి ఉన్నారు.

ఒకానొక సమయంలో భగవద్రామానుజులు తమ శిష్య బృందానికి భగవద్విషయాన్ని కాలక్షేపం సాయిస్తుండగా శ్రీవేంకటాచల సంబంధ పాశురం వస్తుంది.

**శుమన్దు మామలర్ నీర్‌శుడర్ తూపం కొణ్డు**
**అమర్‌న్దు వానవర్ వానవర్ కోనుడుం...**

..................................

**శిన్దు పూమకిళుం తిరువేంగడత్తు**
**అందమిత్ పుకళ కారెళి లణ్ణలే** - తిరువాయ్‌మొళి

ఈ పాశురాన్ని భక్తులకు వివరించిన రామానుజులు బాధతో కలియుగంలో దీనజనోద్ధరణకై తన క్షీరసాగరాన్ని కూడా వదలిపెట్టి తిరుమలకు తరలివచ్చిన శ్రీనివాసునికి పుష్ప కైంకర్యం నిర్వర్తించడానికి కూడా తిరుమలలో ఒక్కరూ లేరే! అని ఆవేదన చెందుతుండగా, శిష్యులతో అనంతాళ్వాన్ లేచి ఆచార్యుల ఆదేశంతో తాను తిరుమల కొండపై స్వామికి పుష్ప కైంకర్యం చేస్తానన్నారు. రామానుజులు ఆనందంతో, ఇంత

మందిలో అనంతాళ్వాన్ ముందుకు రావడాన్ని అభినందిస్తూ వారిని "ఆణ్‌పిళ్లై" (పురుషుడు) అని సంబోధిస్తారు.

### శ్రీనివాసునికి ఆచార్యులు

ఎక్కడ రామానుజుల అర్చామూర్తిని దర్శించినా అంజలి ముద్రతో దర్శనమిస్తారు. ఒక్క తిరుమల, తిరుపతి మరియు తిరుక్కురుంగుడి దివ్యక్షేత్రాలలో మాత్రం జ్ఞానముద్రతో, ఉపదేశ ముద్రతో సాక్షాత్కరిస్తారు. కారణం ఆ యా క్షేత్రాలలో అక్కడ వెలసిన స్వామికి ఆచార్యులుగా కీర్తింపబడటమే. తిరుమలలో శ్రీనివాసుడు తన అంతరంగ భక్తుడైన తొండమాన్ చక్రవర్తికి శంఖచక్రాలను రక్షణగా ఇచ్చినట్లు శ్రీ వేంకటాచలమాహాత్మ్యంలో పేర్కొనబడి ఉన్నది. అప్పటినుండి శంఖచక్రములు లేకుండ దర్శనమిస్తున్న శ్రీనివాసునికి శంఖచక్రాలను ప్రసాదించినందువల్ల రామానుజాచార్యులు శ్రీనివాసునికి ఆచార్యులుగా కీర్తింపబడుతారు.

### తిరుక్కురుంగుడి

తమిళనాడులోని తిరుక్కురుంగుడి దివ్యక్షేత్రంలో వెలసిన స్వామి బాలుడిరూపంలో రామానుజుల వద్దకు వచ్చి ద్వాదశోర్ధ్వ పుండ్రాలను దిద్దించుకున్నారట. అందువల్ల ఆ దివ్యదేశంలో కూడా ఆచార్యులుగా కీర్తింపబడుతూ ఉపదేశముద్రలో ఉంటారు.

**తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః**

తప్త చక్రాంకనము, ద్వాదశోర్ధ్వపుండ్ర ధారణము, దాస్య నామము, అష్టాక్షరీమంత్రము, యాగము – ఇవి పంచ సంస్కారములు. మొదట ఆచార్యుల ద్వారా ఈ ఐదు సంస్కారములతో సంస్కరింపబడాలన్నది శాస్త్ర ప్రమాణం.

### శుక్రవారభిషేకం

*ఏ దేవాలయంలో దేవదేవుడు లక్ష్మీదేవితో కూడి ఉంటారో, ఆ స్వామికి శుక్రవారంనాడు తిరుమంజనం (అభిషేకం) జరిపిస్తే ఆ దేవాలయం రోజురోజుకు అభివృద్ధి చెందుతుందన్నది ఆనంద సంహిత వచనం.*

సంప్రదాయాన్ని యథా తథంగా కొనసాగించడంలో విశేషమైన సంకల్పమున్నా రామానుజులు వైఖానసాగమంమీద ప్రతిపత్తితో గౌరవంతో ఆనంద సంహిత వచనానుసారం శుక్రవారంనాడు అభిషేకం ఏర్పాటు చేశారు. అప్పటివరకు ప్రతిరోజు మూలమూర్తులకు తిరుమంజనం జరుగుతుండేవి. ఒక రోజు జోరున వర్షం కురుస్తుండటంతో ఆకాశగంగనుండి తీర్థం తీసుకొనిరావడం కష్టమైనందున, కాలక్రమేణ భవిష్యత్కాలంలో భక్తుల సమూహం ఎక్కువై ప్రతినిత్యం అభిషేకం కష్టసాధ్యమవుతుందని ముందే ఊహించిన రామానుజులు శ్రీవైఖానసాగమాను గుణంగా శుక్రవారాభిషేకం ఏర్పరిచారు.

అయితే ఈ నాటికి ప్రతినిత్యం ఆకాశగంగా తీర్థంతో (తిరుమలనంబి వంశీయులు తెచ్చిన) మూలమూర్తి తరపున భోగశ్రీనివాసమూర్తికి తిరుమంజనం నిర్వర్తింపబడుతుంది.

### శ్రీవారికి సువర్ణకంఠిక వక్షఃస్థలక్ష్మీహారం సమర్పణ

శ్రీవేంకటేశ్వరస్వామి ఎప్పుడూ నవరత్నఖచిత వజ్రవైఢూర్యాది ఆభరణ శోభితుడై ప్రకాశిస్తుంటారు. ఆ అర్చారూపం దివి నుంచి భువికి దిగివచ్చిన శ్రీమన్నారాయణుడు. ఆ నిజ రూపాన్ని తనివి తీరా దర్శించాలని, సేవించాలని, తరించాలని ప్రతి భక్తుడి ఎదురుచూపు. ఆ విధమైన నిజరూపదర్శనం, ఆభరణము లేవియు లేక దివ్యతిరుమేని సందర్శనం అనిర్వచనీయ అనుభూతి. ఇలాంటి అనుభూతి శుక్రవారాభిషేక సమయంలో మాత్రమే పొందగలం. కారణం సంపూర్ణ దివ్యసుందర మంగళ అర్చామూర్తి నిజరూపదర్శనం. ఆభరణాలన్నీ సడలింపు చేసినప్పుడు స్వామి దర్శనం. ఆ సయమంలో అన్నీ ఆభరణాలను సడలింపు చేసినా వక్షఃస్థలంలో సువర్ణకంఠికలోని మహాలక్ష్మి అమ్మవారి ఆభరణం అలాగే స్వామితోపాటే ఉంటుంది. అది భగవద్రామానుజ సమర్పితహారం. *స్వామి హృదయపీఠంపై ద్విభుజాలతో, నాలుగు హస్తాలతో వ్యూహలక్ష్మిగా కేశవప్రియగా మహాలక్ష్మి వెలుగొందుతుంటుందన్నది ఆగమశాస్త్రం.*

### తిరుమలనంబి వారి వద్ద రామాయణ కాలక్షేపం

శ్రీవేంకటాచల పాదసన్నిధిలో శ్రీరామానుజులు తమకు మేనమామ మరియు గురువులైన తిరుమలనంబివారి వద్ద రామాయణ కాలక్షేపాన్ని చేస్తున్నారు.

విశ్వంభర మహర్షి అనుమహర్షి తన కలలో కనిపించిన రీతిగా రామలక్ష్మణాది విగ్రహాలను తయారుచేయించుకొని పూజిస్తున్నారు. కాలక్రమేణ వృద్ధాప్యంలో ఆ విగ్రహాలను శిష్యులమూలంగా తిరుమల అలిపిరి ప్రాంతానికి చేరుస్తారు. ఆ సమయంలో రామానుజులు సీతారామ కల్యాణ వృత్తాంతాన్ని కాలక్షేపం సేవిస్తున్నారు. ఆ అర్చామూర్తులలో సీత లేక పోవడంతో సీతా విగ్రహాన్ని చేయించి సీతారామకల్యాణాన్ని జరిపించి తిరుమల దేవాలయంలో ప్రతిష్ఠించినట్లు శ్రీవేంకటాచలేతిహాసమాలా గ్రంథంవలన తెలుస్తున్నది.

తిరుపతి, తిరుమలలో అనేక ఉత్సవాల నిర్వహణ, ప్రత్యేకించి అధ్యయనోత్సవాలు సకల విధములైన సదాచార – సంప్రదాయ పరిరక్షణ నియమాలను ఏర్పరిచి తిరుమలకొండ ఖ్యాతిని ఇనుమడింప చేశారు.



# యతిరాజశేఖర వచనములు ఒక పరిచయము

- ఆచార్య కె.జె. కృష్ణమూర్తి,
83740 28457

తెలుగు సాహిత్యంలో "స్తుతివచనములు" ఒక విశిష్ట మైనశాఖ. క్రీ.శ. 13వ శతాబ్దిలో సింహాచలక్షేత్రంలో విలసిల్లిన భక్తకవి కృష్ణమాచార్యుడు రచించిన 'సింహగిరి నరహరి వచన ములు' ఆ కోవలో మొట్టమొదటివి. అటు తర్వాత 16వ శతాబ్దం నుండి వరుసగా వెలువడిన స్తుతివచన రచనల్లో తాళ్లపాక పెదతిరుమలాచార్యుడు రచించిన 'వేంకటేశ్వర వచనములు', కాసె గంగాధరప్ప రచించిన 'గంగాధరయ్య వచనములు', ఊరె శంకర కవి రచించిన 'భవానీ మనోహర వచనములు'–మొదలై నవి ముఖ్యమైనవి.

కాలక్రమేణ, ఇలాంటి స్తుతివచనాలను మహనీయులైన గురుపుంగవులను, మతాచార్యులను ఉద్దేశించి కూడా కవి వర్యులు రచిస్తూ వచ్చారు. అటువంటి స్తుతివచనాలలో "యతి రాజశేఖర వచనములు" - అనేవి ప్రకృష్టంగా పేర్కొనదగి ఉన్నాయి. ఇవి యతిరాజశేఖరులై విరాజిల్లిన భగవద్రామాను జాచార్యులవారిని ఉదాత్తంగా ప్రస్తుతిస్తూ రచింపబడిన నూట యెనిమిది వచనాలు.

ఇందలి ప్రతివచనము శ్రీమద్రామానుజులవారిని ఉద్దేశించిన సాభిప్రాయమగు సంబోధనతో ఆరంభింపబడి ఉంటుంది. తక్కిన వచనమంతా ఆ సంబోధన యందలి భావానికి అనుగుణమైన రీతిలో సొంపుగా విస్తరించి ఉంటుంది. ప్రతి వచనం చివరలో 'శేషనగరాధినాథ! రామానుజ! నమో నమో యతిరాజశేఖరా!' - అనే భక్తిభావభరితమైన మకుటం నెలకొని వుంటుంది.

ఈ గ్రంథ రచయిత ఇల్లిందల పరవస్తు రామానుజా చార్యుడు. గార్గ్య గోత్రజుడు, తెంగలై శాఖీయుడైన ఆచార్యోత్త ముడు. తండ్రిపేరు వేంకటాచార్యులు. ఈ రామానుజాచార్య కవీశ్వరుడు ఆంధ్ర, గీర్వాణ, ద్రావిడ, కర్ణాటాది భాషలలో నిష్ణాతుడైన విద్వత్కవియని ఇందలి 105వ వచనం సాక్ష్యమి స్తున్నది.

ఈ కవివర్యుడు నేటి చిత్తూరు జిల్లా యందలి మదన పల్లికి సమీపానగల 'తెట్టు'- అనే గ్రామంలో క్రీ.శ. 17వ శతాబ్ది ఉత్తరార్థంలో విలసిల్లిన విద్వద్వరేణ్యుడు. ఆ గ్రామంలో శ్రీగోదా సమేత వేణుగోపాలదేవుని ఆలయం నెలకొని ఉంది. అచ్చటి స్వామి అక్రూరప్రతిష్ఠితుడనీ, సంతానప్రదుడనీ స్థలపురాణం! ఆ గుడిలో విలసిల్లుతున్న శ్రీమద్రామానుజభగవత్పాదులను ఉద్దేశించియే కవి యీ 'స్తుతివచనకృతి'ని వెలయించినాడు. ఇందుకు అవతారికగా సమకూర్చిన సంస్కృత శ్లోకాల్లో ఈ కవీంద్రుడు క్రింది విధంగా తన వినయశీలాన్ని వెల్లడించి ఉండటం ముఖ్యవిశేషం!

"శేషనగర (తెట్టు) నివాసియు, శేషస్వరూపుడునైన యీ భాష్యకారులు నా మనస్సులోను, వాక్కునందును ప్రవేశించి, స్వయంగా ఈ వచనములను నా చేత పల్కించియున్నారు. కావున, ఆయనయే ఈ గ్రంథమునకు వక్తనే నిచ్చట లేఖకుడను మాత్రమే! (అత్రాస్మి లేఖకోఽహ వక్తా స్వయమే భాష్యకారో హి)"

**చిత్తూరు జిల్లా తెట్టు గ్రామం శ్రీ గోదాసమేత వేణుగోపాలస్వామి ఆలయంలోని శ్రీరామానుజులను స్తుతిస్తూ రచింపబడ్డ గ్రంథం, ఈ "యతిరాజశేఖర వచనములు". 17 వ శతాబ్దంలోని రచయిత ఇల్లిందల పరవస్తు రామానుజాచార్యుడు ఆ వూరివాడే.**

ఈ గ్రంథానికి సంబంధించిన ఒక తాళపత్రప్రతిలో ఈ వచనాల ప్రారంభంలో భూపాలం, భైరవి, శంకరాభరణం - లాంటి రాగాలపేర్లు లిఖింపబడివున్నాయి. దీనిని బట్టి, ఈ స్తుతి వచనాలను ఆ యా ప్రత్యేక సన్నివేశాల్లో ఉడయవరుల సన్నిధిలో భక్తి ప్రపత్తులతో ఆలాపిస్తూవుండే సంప్రదాయం ఉండినట్లు తెలియవస్తూ ఉంది. ఈ కృతికి "రామానుజ విన్నపములు", 'రామానుజామృతము'- అనే మరో రెండు నామ ధేయాలను ఈ కవిశేఖరుడు గ్రంథాంత గద్యలో ప్రతిపాదించి యున్నాడు. ఇది ఈ సందర్భంలో ప్రశంసింపదగిన అంశం!

మొత్తం మీద తెలుగులో వెల్లివిరిసిన శ్రీమద్రామానుజా చార్య సంబంధి వాఙ్మయహారంలో ఈ మధురకవితాకృతి మధ్య మణిన్యాయంగా భాసిస్తూ, భాషా, సాహితీ వికాస పరిశీలనకు అత్యంతము ఉపయోగకరమైన అపూర్వ, అమూల్యరచనగా, అలరారుతూ ఉంది.





# పరమగురువు చరమసందేశం

– శ్రీ ముడుంబ వెంకటాచార్యులు

శ్రీమద్రామానుజులు 120 సంవత్సరాలు జీవించారు. అందులో చివరి 60 సం॥లు శ్రీరంగంలోనే ఉండిపోయారు. చివరకు శ్రీరంగనాథుణ్ణి – "ఈ శరీరం విడిచిపెట్టడానికి అనుజ్ఞ ఇమ్మ" ని కోరారు. రంగనాథుడు మొదట బదులు చెప్పలేదు కాని, మరీ మరీ కోరగా ఒక రోజున సరే నన్నారు. ఆరోజు సంతోషంగా మఠంచేరి తన అభిప్రాయం శిష్యులకి చెప్పారు. వారికి ఆపుకోలేని దుఃఖం వచ్చింది. రామానుజులు వారినోదార్చి రాత్రికి అందరిని సమావేశపరచి తమ అంతిమ సందేశాన్ని ఈ విధంగా ఇచ్చారు.

"శ్రీవైష్ణవుల్ని (విష్ణుభక్తుల్ని), మీకు మంత్రోపదేశం చేసిన గురువులను గౌరవించేటట్లు గౌరవించండి. పూర్వాచార్యుల ఉపదేశాల్లో పూర్తి విశ్వాసముంచండి. మీరు ఇంద్రియాలకెన్నడూ బానిసలు కాకండి. ప్రాపంచిక విజ్ఞానం పొందడంతో తృప్తి పడకండి. భగవంతుని అనంత కల్యాణ గుణాల్నీ, ఆయన సృష్టి వైచిత్ర్యాన్నీ గురించి తెలిపే గ్రంథాలు నిత్యం చదవండి. మీ గురువుల అనుగ్రహం వల్ల మీకు జ్ఞానోదయమైతే, విషయవాంఛలు అవే తగ్గిపోతాయి. మీ కోరికల్నీ ఆలోచనలన్నీ నిర్లక్ష్యం చెయ్యడం అలవరచుకోండి. భగవన్నామ సంకీర్తనం, గుణ సంకీర్తనం ఎలా చేస్తారో, అలాగే భక్తుల నామసంకీర్తనం, గుణసంకీర్తనం కూడా చెయ్యండి. భగవద్భక్తులసేవ చేసేవారు తొందరగా తరిస్తారని తెలుసుకోండి. భగవంతుడికీ, భగద్దాసులకీ దాస్యం చేస్తేగాని మోక్షం లేదు. మీరెంత ప్రజ్ఞావంతులైనా సరే. వైష్ణవుడుగా జన్మించడం ఏ స్వార్థ ప్రయోజనం సాధించుకోడానికీ కాదు; సంసారబంధం నుండి విడివడడానికే, నిజమైన వైష్ణవుడు తాను వాంఛించేదేమీ ఉండదు."

"మీకు ఉపదేశం చేసిన గురువుల ఘనతను గూర్చి ప్రతిదినం రోజుకొక గంటసేపైనా స్మరించుకోండి. ప్రతిదినం ఆచార్యుల ఆళ్వారుల దివ్యగ్రంథాల్ని చదవండి. ప్రపత్తి మార్గాన్ననుసరించిన వారి సాంగత్యమే చెయ్యండి; ఇతర మార్గావలంబకులకు దూరంగా ఉండండి. ధనార్జనా పరులతోనూ, విషయలంపటులతోనూ సాంగత్యం చెయ్యకండి; భక్తుల సాంగత్యమే చెయ్యండి. కులాన్ని బట్టి భక్తులకు విలువ కట్టకూడదు. దివ్య స్థలాలలోని విగ్రహాలను రాళ్ళగానూ, మంత్రదీక్ష ఇచ్చిన గురువుని సామాన్య మానవునిగానూ, భక్తులపాపాల్ని పోగొట్టగలిగిన శ్రీపాదతీర్థాన్ని సామాన్య జలంగానూ, పవిత్రమంత్రాలను ఏదో

**సంపూర్ణ శరణాగతి చేసినవారు తమ భవిష్యత్తుకై చింతించకూడదు. మీరు భగవంతునిసొత్తు కాబట్టి, మీ మంచిచెడ్డల బాధ్యత ఆయనదే. మీ గురించి మీరు కొంచమైనా ఆందోళన పడ్డారంటే మీ శరణాగతి బూటకమే.**

శబ్దసముదాయంగానూ, సర్వజగన్నాథుడైన శ్రీమన్నారాయణుని ఏ ఇతర దేవతలతోనో సమునిగానూ చూచేవాడు నరకానికే యోగ్యమైనవాడుగా గ్రహించండి."

"మా జీవితాల్ని మరణపర్యంతం ఎలా గడపమం టారో ఆజ్ఞాపించండి" అని శిష్యులడగ్గా ఆయన ఇలా చెప్పారు.

"సంపూర్ణ శరణాగతి చేసినవారు తమ భవిష్యత్తుకై చింతించ కూడదు. మీరు భగవంతునిసొత్తు కాబట్టి, మీ మంచిచెడ్డల బాధ్యత ఆయనదే. మీ గురించి మీరు కొంచమైనా ఆందోళన పడ్డారంటే మీ శరణాగతి బూటకమే. అది మీ కుటిలస్వభావాన్నే తెలియజేస్తుంది. మీ ప్రస్తుత జీవితాలు మీ పూర్వకర్మల్ని బట్టి నడుస్తున్నాయి. అందుచే వాటిని గురించి విచారించి లాభం లేదు. మీ విధిని మీరు నిర్వర్తించడము భుక్తికోసం చేస్తున్న పనిగా కాక, భగవత్సేవగా భావించండి."

"శ్రీభాష్యం చదివి ఇతరులకు బోధించండి. ఇది భగవంతునికి మిక్కిలి ప్రీతికరమైనపని. ఇది సాధ్యం కాక పోతే శఠగోపమహాముని వాఙ్మయంగాని, అలాంటి ఇతర గ్రంథాలుగాని పఠించి అర్హతగల శిష్యుల కుపదేశించండి. ఇదీ సాధ్యం కాకపోతే పుణ్యక్షేత్రాల్లో భగవత్సేవ చెయ్యండి. అదీ కాకపోతే యాదవాద్రిలో ఒక కుటీరం వేసుకుని ప్రశాంతంగా కాలక్షేపం చెయ్యండి. అదీ కాకపోతే మీరున్న చోటనే ఉండి, ద్వయమంత్రానుసంధానం చేస్తూ కూర్చోండి. మీ కివేవీ సాధ్యంకాకపోతే భక్తిజ్ఞానవైరాగ్యాలు గల వైష్ణవునివద్ద, ఆయన దయ మీపై కలిగేలా మసలుకోండి. మీలో రవంతకూడా అహంకారం లేకుండా చేసు కుని ఆయన మాటల్ని పాటించండి. అది మోక్ష ప్రదాయకం."

"సరియైన విచక్షణతో మీకుగల స్నేహితుల్నీ, శత్రువుల్నీ, ఉదాసీనుల్నీ తెలుసుకోండి. విష్ణుభక్తులు మీ స్నేహితులు, భగవంతుని ద్వేషించేవారు మీ విరోధులు; లౌకిక ఉన్నతే ప్రధానంగా జీవించేవారు మీకు ఉదాసీనులు. మీ స్నేహితుల్ని చూచి ఫలపుష్ప తాంబూల చందనాదుల్ని చూచినట్లు సంతోషించండి; విరోధుల్ని చూచి సర్ప వ్యాఘ్ర అగ్ని చోరాదుల్ని చూచినట్లు భయపడండి. వైష్ణవసాంగత్యం మీకు ఆధ్యాత్మికోన్నతిని కలుగజేస్తుంది; మీ శత్రువుల సాంగత్యంగాని, లౌకికుల సాంగత్యంగాని ఎన్నడూ చెయ్యకండి; వారితో మాట్లాడకండి. వారివల్ల వచ్చే లౌకిక ప్రయోజనం కోసం వారిని గౌరవించి వారివల్ల లాభాలు పొందితే చివరికి భగవద్విరోధు లౌతారు, భావం శుద్ధమయితే ప్రవర్తన శుద్ధమౌతుంది.




ఇతరులలోని దోషాలు వెతక్కండి. దోషాలు లేని వ్యక్తి ఉండడు. పరుల దోషాలను చూసే అధికారం ఎవ్వరికీ లేదు. ఇతరులను సేవించడమే, వారికి సహాయపడడమే మీ కర్తవ్యం. మీరు కోరేవాటి నన్నిటినీ భగవంతుడే మీకు సమకూరుస్తాడనే దృఢమైన అధ్యవసాయం కలిగి ఉండండి.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్ష యిష్యామి మాశుభః

అనే భగవంతుని వాక్యంలో విశ్వాసముంచండి."



# వైకుంఠపాళి 06

**నిర్వహణ**
**బి.వి.ఎస్.ఎస్.సుబ్రహ్మణ్యం**



## అడ్డం

**2)** 'హరవిలాసం' కృతికర్త (5)
**5)** బుద్ధునికి ఈ వృక్షం క్రిందనే జ్ఞానోదయం అయింది (2)
**7)** మనసు (2)
**8)** 'గిడుగు' వారు ఈ భాషకి చాలా సేవ చేశారు (3)
**9)** అందం తిరగబడింది (2)
**11)** అటు నుంచి ఇటు వచ్చి అభయం కోరండి (3)
**12)** ఆ నది మంత్రాలయం దగ్గర తిరగబడింది (4)
**13)** ముఖ్యమంత్రి ఈ నదిని, 3 నిలువులోని నదితో అనుసంధానం చేయ సంకల్పించారు (4)
**15)** ఈమె నటుడికి వ్యతిరేకం (2)
**16)** కృష్ణాతీరాన నృసింహక్షేత్రం (3)
**17)** మాట తోటిది (2)
**19)** ఉత్తర భారతదేశంలోని పంచనదులలో ఈ నది అటు నుంచి ఇటు ప్రవహించింది (2)
**20)** త్రాడు (2)
**21)** నక్షత్రం (2)

జవాబులు
ఈ సంచికలోనే ఉన్నాయి.

అన్వేషించి....
సరిచూసుకోండి.

- ప్రధాన సంపాదకుడు

## నిలువు

**1)** కళ్లు లేని ............ (3)
**3)** శ్రీకాకుళం సమీపాన ఉన్న నది (4)
**4)** కావ్యం వికృతి (2)
**6)** వ్యాసుడు (6)
**7)** 'ఇంద్రజ' కాదు, ఉత్తరాంధ్రలో ఓ నది (6)
**9)** సరిహద్దు (క్రింది నుంచి మీదికి) (3)
**10)** తేలికగా చేరగలుగుట (3)
**11)** మరోమారు తారుమారుగా అభయాన్ని అడగండి (3)
**14)** క్రిందటేడు ఈ నదికి ఘనంగా పుష్కరాలు జరిగాయి (4)
**17)** తెలంగాణా రాష్ట్రంలోని నది (3)
**18)** క్షణం (2)

# జయ జయ నృసింహా! సర్వేశా!!

– శ్రీ జె. అనిల్ కుమార్

శ్లో॥ పాతువో నరసింహస్య నఖలాంగల కోటయః,
హిరణ్యకశిపో ర్వక్షః క్షేత్రా సృక్కర్దమారుణాః

– శ్రీనరసింహుని నఖస్తుతి.

హిరణ్యకశిపుని వక్షం అనే పొలంలోని ఎర్రని నెత్తురు బురద అంటుకున్నందువల్ల బాగా ఎర్రగా ప్రకాశిస్తున్న నాగళ్ల వంటి శ్రీనరసింహుని వాడి అయిన గోళ్లు అందరినీ, అన్ని వేళల్లో రక్షించుగాక!

లోకంలో తల్లిదండ్రులకు తెలివైన సంతానంమీదికంటె, మూర్ఖులు, తెలివితక్కువ పిల్లలమీదే ప్రేమ ఎక్కువ. వీళ్ళు జీవితాన్ని ఎలా వెళ్లబోస్తారా అని, నిత్యం వాళ్లమీదే బెంగ. అలాగే సర్వజగన్నియామకుడు సర్వజగత్పిత అయిన భగవంతుని ప్రేమ పిల్లలమీద ఇంకెంతుంటుందో ఎవరు చెప్పగలరు. అందులోను ఆయనకు భక్తులంటే మరీ పిచ్చిప్రేమ. ఇక దారి తప్పిన 'పిచ్చి' భక్తులంటే భగవంతునికి మరీ మరీ వెర్రెత్తే కరుణ.

కృతయుగంలో అలా దారి తప్పిన, వెర్రెత్తిన మూర్ఖ భక్తుడు ఒకడు వుండేవాడు. అతడి పేరే హిరణ్యకశిపుడు. విష్ణు భగవానికి అతడంటే ఎంత పిచ్చి ప్రేమో! లేకపోతే, వాడు ఎలా కోరితే అలాగే 'సరే' అంటూ వాడి 'పిచ్చి' వంకరలను తీర్చడానికి "నరసింహుడి"గా అవతరిస్తాడా!

ఆ దుష్టరక్కసుడు తనకు రాత్రిగాని, పగలుగాని, ఇంట్లోగాని, బయటగాని, ఆకాశంలోగాని, నేలమీదగాని, జీవంవుండే వాటివల్లగాని, నిర్జీవమైన ఆయుధాలవల్లగాని, మానవులవల్ల గాని, జంతువులవల్లగాని... తనకు చావే రాకూడదనీ, ఉండకూడ దనీ ఇలా పరిశీలించి, పరిశోధించి ఆ పిచ్చివాడు మూర్ఖంగా అడుగుతాడా! అన్నింటికి సరే! సరే! అంటూ వాడి మీది అంతులేని ప్రేమవల్లవాడు కోరినట్లుగానే "నరసింహుని"గా అవతరించి హిరణ్యకశిపుని 'పిచ్చి'ని కుదిర్చిన స్వామి ఎంత పిచ్చివాడో కదా!

భగవంతునికి ఇంకో ప్రత్యేకమైన 'తిక్క' గుణం ఉంది. పిచ్చివాళ్లు, మూర్ఖులు ఎవరైనా సరే, తనను తిట్టినా, తెగడినా




తిరుమల శ్రీనివాసునికి
ఇలవేల్పు శ్రీలక్ష్మీనృసింహస్వామి.

తిరుమలేశుని
వివాహ సందర్భంగా తొలిగా
శ్రీనృసింహునికి నివేదన
చేసినట్లు
వేంకటాచలమాహాత్మ్యం
చెబుతోంది.

తిరుమల శ్రీవారిఆలయంలో
ఒక నృసింహస్వామి ఆలయం ఉంది.
ఈయనను "సన్నిధి నృసింహస్వామి" అంటారు.

అలాగే తిరుమలకు అలిపిరిమార్గంలో
నడిచివచ్చేటప్పుడు మార్గమధ్యలో
"త్రోవ నరసింహస్వామి"ని
కూడా దర్శించవచ్చు.

ఏమీ పట్టించుకోడు. ఉదాసీనంగా ఉంటాడు. కొన్ని వేళల్లో తనను తిట్టడంలోకూడా వీళ్లకి ఇంత పాండిత్యం ఉందా! ఇంత ప్రతిభ ఉందా అని ఆనందిస్తుంటాడు. కాని, తన భక్తుణ్ణి ఎవరైనా తిట్టినా, బాధించినా, హింసించినా ఒక్క క్షణం, అంటే ఒక్కక్షణం కూడా భరించలేడు. ఆగలేడు. ఊరక ఉండడు కూడా. అందుకు పరమోదాహరణ శ్రీనృసింహ భగవానుడు! ఎందుకంటే!

హిరణ్యకశిపుడు తలకెక్కిన 'వెర్రి'తో భగవంతుణ్ణి క్షణక్షణం తిట్టాడు. ప్రతి క్షణం నిందించాడు. అడుగడుగునా, అణువణువునా గాలించి వెదికాడు. ఇలా తనకోసం ఎంత మాత్రం సందు వదలకుండా అంతటా వెదుకుతూ ఉన్నా, తిడుతూ ఉన్నా, ఎదుటపడకుండా ఎక్కడో దాగుకొన్న 'పిరికి పంద' అని తిట్టినా ఏ మాత్రం కోపించలేదు స్వామి. ఒకటా, రెండా, ఎన్ని తిట్లు తిన్నాడో! అయినా ఆ స్వామి ఉలకలేదు. పలకలేదు.

**తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామిని పదవ నారసింహంగా అంటే "శాంతనరసింహుని"గా పేర్కొ న్నాడు అన్నమయ్య.**

**దీనికి తగినట్లుగా తిరుమలేశుడు ప్రతి నిత్యం, "ఓం ఉగ్రాయ నమః, ఓం వీరాయ నమః, ఓం మహావిష్ణవే నమః, ఓం జ్వలనాయ నమః, ఓం సర్వతోముఖాయ నమః, ఓం నృసింహాయ నమః, ఓం భీషణాయ నమః, ఓం భద్రాయ నమః, ఓం మృత్యుమృత్యువే నమః" అని నృసింహస్వామి నామాలతో అర్చింపబడుతుండడంతో ఇద్దరూ అభిన్నులు, ఒక్కరే అని స్పష్టమవుతున్నది.**

కాని ఆ మూర్ఖుడు, ఆ హిరణ్యకశిపుడు స్వయంగా తన కొడుకును, చిన్నపిల్లవాణ్ణి, ప్రహ్లాదుణ్ణి హింసిస్తాడా! ఇంతకూ ఆ 'కుర్రకుంక' చేసిన తప్పేమిటి? నారాయణ! నారాయణ! అంటూ జపం చెయ్యడమేనా! గోవిందా! గోవిందా! అంటూ భజన చెయ్యడమేనా! దాన్ని సహించలేక, ఆ ప్రహ్లాదుణ్ణి పిల్లవాడని కూడా చూడకుండా తనమీది (భగవంతుని) ద్వేషంతో ఒక్క విధంగానా, ఒక్కసారా! ఎన్నిమార్లో, నీళ్లలో ముంచాడు, అగ్నిలో మాడ్చాడు, లోయల్లో పడేశాడు. పాములతో కరిపించాడు. ఏనుగులతో తొక్కించాడు.... ఇంకా ఎన్నెన్ని రకాల్లో బాధలు పెట్టాడో ఆ దేవుడికే ఎరుక! అయితే ఏం! ఆ కుర్ర ప్రహ్లాదుడు కొంచెమయినా కందిపోయాడా? ఆవగింజంతయినా అలసిపోయాడా? దైవబలం ఉంటే ఎవరేం చేసినా ఏమీ జరగదుగాక జరగదన్నమాట! ఇది పరమసత్యం!

భక్త ప్రహ్లాదుని మీద, హిరణ్యకశిపుని ఆగడాలు ఇంకా మితి మీరకుండా, వాణ్ణి చంపివేయడానికి సమయం ఆసన్నం అయ్యిందని తలంచాడు శ్రీమహావిష్ణువు. సరిగ్గా అదే సమయంలో ఎక్కడరా నీ గోవిందుడు అని గద్దించి అడిగాడు ఆ దానవరాజు. నాన్నా! ఎక్కడ లేడు? అంతటా ఉన్నాడు! "వెతికి చూస్తే" ఎక్కడైనా కనపడతాడు, అన్నాడు ప్రహ్లాదుడు.

"అలాగా! అయితే ఇదిగో ఈ ఉక్కుకంభంలో దాగి ఉన్నాడేమో చూస్తా" అంటూ తన గదతో దానిపై ఒక్క వేటు వేశాడు. అంతే! భీకరంగా నరమృగరూపంతో అవతరించిన స్వామి, హిరణ్యాక్షుణ్ణి ఒడిసిపట్టి సంహరించాడు.

అలా అవతరించిన నాటినుండి ఇప్పటికీ, రేపటికీ, ఎప్పటికీ విశ్వమంతా నిండి, నిబిడీకృతమైవుంటూ, ఎందరి చేతనో ఎన్నోవిధాల ఉపాసింపబడుతూ, భక్తుల వెతలను పోగొడుతున్న స్వామి శ్రీ లక్ష్మీనృసింహుడు!

ఒకప్పుడు శనైశ్చర భగవానుడు ఎక్కడికో వెళుతుండగా, ఆశ్చర్యంగా ఆయనకు శ్రీ నృసింహస్వామివారి దర్శనభాగ్యం కలిగింది. ఇంకేముంది! తొట్రుపాటుతో కూడిన ఆనందంతో శనిభగవానుడు "నృసింహుణ్ణి" అత్యంత భక్తిగా స్తుతించాడు. "శనైశ్చరా! నీవు చేసిన స్తోత్రం వల్ల నాకు చాల ఆనందం కలిగింది. ఏదైనా వరం కోరుకోవయ్యా' – అంటూ నరసింహస్వామి పలికాడు.

స్వామీ! నృసింహభగవన్ నీవు అవతరించిన శనివారమే, నాకు ప్రియమైనరోజు కూడా. ఈ రోజున నేను చేసిన ఈ సోత్రాన్ని పఠిస్తూ నిన్ను కీర్తించినా, విన్నా అన్ని కోరికలు నెరవేరునట్లు వరాన్ని ఇవ్వు అంటూ అడిగాడు శనిదేవుడు. తథాస్తు!

**శ్లో॥ త్వత్ కృతం మత్పరం స్తోత్రం యః పఠేచ్ఛృణు యాచ్చ యః**
**ద్వాదశాష్టమజన్మస్థాత్ త్వద్భయం మాస్తు తస్య వై**
**శనిర్నరహరిం దేవం తథేతి ప్రత్యువాచ హ**
**తతః పరమసంతుష్టాః జయేతి మునయోఽవదన్**

**– శనైశ్చరకృత శ్రీనృసింహస్తుతి**

అంటూ వరం ఇచ్చాడు నృసింహస్వామి. అంటే ఈ స్తోత్రాన్ని చేస్తే చాలు. వింటే చాలు. ఏలినాటి శని, అష్టమ శని, అర్ధాష్టమశని దోషాలు తొలగి, కోరికలు సిద్ధిస్తాయని అర్థం. 18 శ్లోకాలతో వున్న ఆ స్తోత్రరాజం "శనైశ్చర కృత శ్రీ నరసింహ స్తుతి"గా ప్రసిద్ధికెక్కింది.

అందుకే సర్వకలుషభంజనుడైన స్వామివారిని మనం అందరం "జయ జయ నృసింహా! సర్వేశా!!" అని కీర్తిస్తూ ధన్యులమవుదాం.





# షణ్మతాచార్యులు

# శ్రీజగద్గురు శంకరులు

- ఆచార్య రాణీసదాశివమూర్తి,
94402 46354

## శంకరుల ప్రాదుర్భావం

శివగురు, ఆర్యాంబల సంతానమైన శ్రీశంకరులు కేరళదేశంలోని కాలడి అగ్రహారంలో వైశాఖశుక్లపంచమి నాడు జన్మించారు. పుట్టిన దగ్గరనుంచి విశేషాలే. బాల్యం లోనే వేదవేదాంగ, శాస్త్రాలనన్నింటినీ 12 సంవత్సరముల లోపే అధ్యయనం చేశారు. గురుకులవిద్యాభ్యాసం చేసే సమయంలో, కనకధారాస్తవం, పఠించి ఒక పేదరాలి ఇంట బంగారు ఉసిరికాయలవర్షాన్ని కురిపింపచేసి ఆమెను శ్రీమహాలక్ష్మీ అమ్మవారి కృపకు పాత్రురాలిని చేశారు. తల్లి దూరంలోఉన్న నదినుంచి నీటిని అనారోగ్యం వల్ల తెచ్చు కోలేకపోతున్నది అని పూర్ణానదిని ప్రార్థించి తమ ఇంటి ముంగిటి నుండియే ఆ నది ప్రవహించేలా చేశారు.

అ పిమ్మట మొసలి తనకాలిని పట్టుకోవటం వల్ల తల్లి అనుమతితో ఆపత్సన్యాసం తీసుకున్నారు. తదుపరి నర్మదానదీతీరంలో గోవిందభగవత్పాదుల నుండి సన్యాస దీక్షను తీసుకుని అద్వైతమత అధ్యయనం చేశారు. కాశీలో శిష్యపరంపర పెరగసాగింది. అక్కడే పద్మపాదులు; శంకర-చాండాలసంవాదం; వ్యాసశంకరుల సంవాదం; వ్యాసుల ప్రేరణతో బ్రహ్మసూత్రభాష్యరచన; కుమారిలభట్టును, మండనమిశ్రుని జయించటం; తోటకాచార్యాది శిష్యులు; మాతృవియోగం. సేతుబంధం నుంచి కాశ్మీరంవరకు దిగ్వి జయం. కాశ్మీరంలో సర్వజ్ఞపీఠారోహణం చేశారు. శిష్యు లకు అద్వైతమతప్రచారసారధ్యం అప్పచెప్పి కేదారనాథ క్షేత్రంలో హిమాలయాలలో కైలాసపర్వతశ్రేణులలోకి వెళ్ళి పోయి అంతర్ధానమయ్యారు.

భారతదేశ చరిత్రలో ఒక మహోన్నతమూర్తి ఆది శంకరులు. ఆధ్యాత్మిక జగత్తులోని తాత్త్విక సమస్యలన్నిం టికీ ఏకైక పరిష్కారమైన అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదిం చిన మహాజ్ఞాని. అనంత భారతీయ సాహిత్య పరంపరలో



సార్థైక శత గ్రంథాలను రచించి ఎనలేని కీర్తిని గడించిన పరమాద్భుత సాహిత్యవిధాత. పరమమోక్ష సాధనోపాయం అద్వైతము మాత్రమే అని సందేహాతిరిక్తంగా ప్రకటించిన ఈ మహనీయుడు భారతీయ ఏకాత్మతా సాధనకోసమై, మధ్యమాధికారుల సాధన పరిపక్వత పొందటం కోసం కర్మమార్గాన్ని, భక్తిమార్గాన్ని కూడా పరికరాలుగా అంగీకరించారు. అద్వైతానికి ఆధార స్తంభాలనదగిన ప్రాతిభాసిక సత్తా, వ్యావహారిక, సత్తా పారమార్థిక సత్తాలలో ఒకటైన వ్యావహారిక సత్తా ప్రయోజన సిద్ధకోసమై కర్మ, భక్తి అవసరమని గుర్తించి భక్తి ప్రపంచంలో శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య, కౌమార, సౌరములనే ఆరు ప్రధాన దేవతారాధన విధానాలను అంగీకరించారు. భక్తి సామ్రాజ్య వైభవాన్ని ప్రతిష్ఠాపించే ప్రయత్నంలో ఆయాదేవతల గుణమహిమా కీర్తనాత్మకములైన స్తోత్రాలను అగణితంగా రచించారు. కేవలం ముప్పది రెండు సంవత్సరాల జీవితకాలంలో అనితర సాధ్యంగా బృహద్గ్రంథసముదాయ సృష్టిచేసి విశ్వ మానవ సుఖజీవనానికి స్వర్ణమార్గాన్ని వెలయించారు.

### తిరుమలలో శ్రీఆదిశంకరులు

**జగద్గురు శ్రీఆదిశంకరులవారు ఆసేతు హిమాచలం భారతదేశ పర్యటనలో భాగంగా తిరుమలేశుని సందర్శించారని, ప్రస్తుతం శ్రీవారి హుండీ ఉన్న చోట శ్రీచక్రయంత్రాన్ని వారు ప్రతిష్ఠించారని, అందువల్లే అపరిమితమైన జనాకర్షణ, ధనాకర్షణ జరుగుతూ ఉందని అనూచానంగా సంప్రదాయంగా వినవస్తున్నమాట.**

## శ్రీశంకరుల సారస్వతం

**'శ్రీ శంకరుల కవిత విద్వాంసుల తపఃఫలం శ్రుతి వధువు సిగలో మల్లికామాలిక. వాగ్దేవీ చిరభోగ భాగ్యవిభవ ప్రాగ్భార కోశాలయమది.'** అని శ్రీవిద్యారణ్యులు శంకర సాహిత్యాన్ని శ్లాఘించారు.

స్వభావాన్ని బట్టి ఈయన వ్రాసిన గ్రంథాలను భాష్యగ్రంథాలనీ, ప్రకరణ, ఉపదేశ గ్రంథాలనీ, స్తోత్ర గ్రంథాలు అని మూడు విధాలుగా విభజించారు. వాటిలో...

### భాష్యగ్రంథములు (23)

భాష్యగ్రంథములు అనేవి పూర్వమునుంచి పరంపరాగతంగా వస్తున్న శాస్త్రప్రవాహంలో ముఖ్యగ్రంథాలుగా గ్రహింపబడే గ్రంథాలకు సుకుమారమతులకు, సామాన్యులకు కూడా అర్థంకావటంకోసం వ్రాసే విశిష్టవ్యాఖ్యానములన్న మాట. వేదాంతపరంపరలో 23 గ్రంథములకు భాష్యరచన చేశారు ఆచార్య శ్రీశంకరులు.

### ప్రకరణ గ్రంథములు మరియు ఉపదేశ గ్రంథములు (54)

**'శాస్త్రైక దేశ సంబద్ధం, శాస్త్రకార్యాంతరే స్థితమ్, ఆహుః ప్రకరణం నామ గ్రంథ భేద మవిస్తరమ్॥'** అంటే శాస్త్రములో తారసిల్లే అనేకవిషయాలలో ఒక్కొక్క విషయాన్ని వివరించటానికి ఒక్కొక్క అతి చిన్న గ్రంథమువంతున శాస్త్ర ప్రధానవిషయాలనన్నింటినీ వివరించేందుకు వ్రాయబడే లఘుగ్రంథాలైన ప్రకరణ - ఉపదేశ గ్రంథాలు యాభై నాలిగింటిని (54) మనకందించారు.

### స్తోత్ర గ్రంథములు (76)

భాష్య, ప్రకరణగ్రంథాలతరువాత **'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'** (మోక్షమును సంపాదింపచేసే విషయసామగ్రిలో ప్రధానమైనది భక్తియే) అని గట్టిగా నమ్మిన ఆచార్యులు 76 భక్తి ప్రధానమైన స్తోత్రగ్రంథాలను గణాధిప, విష్ణు,లలితా, శివ, నృసింహదేవ, లక్ష్మీ,దుర్గా, మీనాక్షీ, శారదాదివిష్ణు,లలితా, శివ, నృసింహదేవ, లక్ష్మీ, దుర్గా, మీనాక్షీ, శారదాదీనాం, దేవతామూర్తుల స్తుతులుగా రచియించినారు.

ఈ విధంగా అత్యంత ఆశ్చర్యకరమైన దృష్టాంతాలతో సర్వజన గ్రాహ్యమైన శైలిలో అతిగహనమైన అద్వైత శాస్త్రవిశేషాలను మృదుమధుర పదబంధంలో అమర్చి సర్వలోకక్షేమ, మోక్షానందదాయకమైన రచనల నందించిన జగద్గురువులైన శ్రీమత్‌శంకరులు విశ్వమానవులెల్లరకూ సర్వదా సర్వథా పూజనీయులు.



జూన్, 2016

# రాశిఫలాలు



బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం :** గ్రహస్థితి శుభాశుభ మిశ్రమం. అష్టమ శని, కుజ ప్రభావం వల్ల ఆర్థికంగా కష్టనష్టాలు, అనారోగ్యం, అశాంతి కలుగుతాయి. దీర్ఘరోగులకు శస్త్రచికిత్స జరుగుటకు అవకాశాలు. వృత్తి, వ్యాపారాలు అంతంత మాత్రంగా సాగును. పుత్రసంతానప్రాప్తి లేక సంతాన విషయమై శుభవార్త వింటారు. సంపద, ఆరోగ్యం, నిత్య సంతోషం, బంధుమిత్రులతో స్నేహం, పుత్రలాభం, ధనలాభం, ఇష్టసిద్ధి కలుగుతుంది.

**వృషభం:** గ్రహస్థితి ప్రతికూలం. చీకటి వ్యాపారం చేయువారికి బంధనయోగం కలదు. వ్యవసాయదారులకు దిగుబడి తగ్గి, వచ్చిన ఆదాయం ఖర్చులకు సరిపోవును. విద్యార్థులకు ఫలితాలు నిరాశాజనకంగా ఉంటాయి. స్వతంత్ర జీవనం చేయువారికి కష్టనష్టాలు కలుగుతుంది. పై అధికారులతో ఇబ్బందులు. గృహమున పోత్సాహకరంగా లేకపోవుట, గృహనిర్మాణంనకై అవస్థలు పడవలసివచ్చును. స్వగృహయోగం కలుగును. రవి జన్మరాశి సంచారంచే కోపం, స్వల్పఅనారోగ్యం, అలసత్వం, ఆదిత్యహృదయపారాయణ చేస్తే మేలు జరుగుతుంది.





**మిథునం :** మిథునరాశివారికి గత మాసం వలె గ్రహస్థితి అనుకూలంగా సాగును. వృత్తివ్యాపారాలలో అభివృద్ధి. ఆర్థికలాభాలు కలుగుతుంది. కానీ, శుభసంబంధమైన ఖర్చులు అధికమౌతాయి. గృహసౌఖ్యం, ధైర్యం, మనోత్సాహంతో పనిచేయుట, నిరంతరం ధనార్జన, ప్రవర్తనలో మార్పు. మిథునరాశివారికీ అత్యంత అనుకూల సమయం. భూగృహ ధనలాభాదులు కలుగును. ప్రతి పనిని ప్రణాళికతో ధైర్యంగా సాధించగలరు.

**కర్కాటకం :** ఈ సంవత్సరం ఈ రాశివారికి మిక్కిలి అనుకూలం. స్వతంత్ర జీవనం చేయు డాక్టర్లకు, లాయర్లకు విశేష ధనలాభం. చేతి వృత్తి పనివారికి మిక్కిలి అనుకూలం. వృత్తి వ్యాపారాలలో విశేషలాభం. రియల్ ఎస్టేటర్లకు ధనలాభం, రొయ్యల చెరువులు చేసేవారికి అధిక ధనలాభం ఉంటుంది. లాభస్థానమందు రవి సమస్తదోషాలను పోగొట్టి, సకలసంపదలను కలుగజేస్తాడు. చేతినిండా ధనం తగినన్ని ఖర్చులు లోటు అనేది లేదు. వాహన సౌఖ్యం.





**సింహం :** గ్రహస్థితి మిక్కిలి అనుకూలం. ఉద్యోగులకు కోరిన ప్రాంతానికి బదిలీ అగు సూచనలు కలవు. విద్యార్థులకు పరీక్షల్లో ఉత్తమశ్రేణి ఫలితాలు పొందుతారు. వ్యవసాయదారులకు అధిక దిగుబడి, స్పెక్యులేషన్, రొయ్యలచెరువులు, ఫైనాన్స్ వ్యాపారులకు విశేషధనలాభం, రాజకీయవాదులకు పదవీయోగం కలుగును. మాటతొందర వలన అనర్థం. పనుల తొందర, పని ఒత్తిడి, కార్యభారం అధికారుల ప్రశంసలు.



**కన్య :** కన్యారాశివారికి గ్రహస్థితి సామాన్యం. వృత్తి వ్యాపారాలలో సామాన్యం. ధనవిషయమై చింత కలుగుతుంది. గతంలో చేసిన పొరపాట్ల వల్ల అశాంతి కలుగుతుంది. ద్వితీయార్థంనుండి క్రమక్రమంగా సమస్యలు తొలగి సౌఖ్యం కలుగుతుంది. వ్యయస్థానమందు రాహువు గురుడు కీర్తి వృద్ధి, తేజస్సు, బలం పెంపొందించుకొనుట, శత్రునాశనం, అన్నింటా విజయం, పుణ్యస్థలాలను సందర్శించుట. పై అధికారుల ప్రసంశలు.



**తుల :** గ్రహిస్థితి ప్రతికూలం. ఇతరుల వ్యవహారాలలో తలదూర్చుట వలన అవమానాలు. రొయ్యలు, షేర్లు చేయువారికి నష్టసూచనలు కలవు. పితృవర్గీయుల వల్ల కష్టనష్టాలు. ఆర్థికసమస్యలు, వృథాప్రయాణాలు, ఆదాయానికి మించిన వ్యయం, శారీరక శ్రమ కలుగుతాయి. ధన, వస్త్ర, ధాన్య లాభాలు, విద్యలచే వినోదం. పిల్లల విద్య విషయాలకై వ్యర్థఖర్చులు.



**వృశ్చికం :** గ్రహస్థితి ప్రతికూలం. చేయు ప్రయత్నాలలో విపరీత జాప్యం, అసహనం, అశాంతి. చేయు వృత్తి, వ్యాపారాలలో ఏమాత్రం కలిసిరాదు. ద్వితీయార్థం దీర్ఘరోగులకు శస్త్రచికిత్స. వాహనచోదకులకు ప్రమాద సూచన. చేతి వృత్తి పనివారికి వలస పోవాల్సి వస్తుంది. ఉద్యోగులకు ఇష్టంలేని ప్రాంతాలకు బదలీ. అద్దె ఇళ్ళవాళ్ళు ఖాళీచేయవలసి రావచ్చు. స్పెక్యులేషన్ షేర్లు చేయువారు కొంతకాలం వ్యాపారం కట్టిపెట్టుట మంచిది.



**ధనుస్సు :** గ్రహస్థితి సామాన్యం వృత్తి, వ్యాపారాలలో అంతంత మాత్రం. పట్టుదలతో సమస్యలు, చిక్కులు అధిగమిస్తారు. చేసే ప్రయత్నాలలో శ్రమానంతరం విజయం. వ్యవసాయదారులు ఋణం బ్యాంకులద్వారా పొందగలరు. ధనవ్యయం, మర్యాద లోపం, తండ్రి తాలూకు ధనాగమనం, కులాచారాన్ని తప్పక పాటించి ఉత్తమ ఫలితాలను సాధిస్తారు. ఉద్యోగస్తులకు పదోన్నతి. శిల్పవిద్య, ఆర్కిటెక్చర్ వారికి విశేషయోగం.



**మకరం :** గ్రహస్థితి అనుకూలం. వ్యవసాయదారులకు అధిక దిగుబడి, ఋణవిముక్తి కలుగుతుంది. ద్వితీయార్థంలో శత్రుజయం, మిత్రలాభం. గత కొంతకాలంగా చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కాని కళత్రపీడ, స్త్రీ కలహం. మనోచాంచల్యం, బుద్ధిభ్రంశం, పనులకు ఆటంకం, బంధువైర్యం, విద్యార్థులకు గణిత విషయమై ఆసక్తి పెరుగుతుంది. కష్టపడి చదివి సత్ఫలితాలను పొందుతారు. వ్యాపారస్తులకు ఆశించిన ఫలితాలు.



**కుంభం :** గ్రహస్థితి అనుకూలం. చేతి వృత్తి పనివారికి ధనాదాయం. స్వతంత్ర జీవనం చేయువారికి స్థిరత్వం మరియు అభివృద్ధి. కుటుంబ సౌఖ్యం, గృహోపకరణ వస్తువుల కొనుగోలు, ఆడంబరాలకై ధనవ్యయం అవుతుంది. జన్మరాశిలో కేతువు మిశ్రమ ఫలితం, ఆధ్యాత్మిక, దైవికశక్తులను పెంపొందించుకుంటారు. కొన్ని విషయాలలో గ్రంథపఠనాశక్తి, పెరుగును. గృహసౌఖ్యం, గృహాన్ని ఏర్పరచుకొంటారు.



**మీనం :** గ్రహస్థితి గత మాసం వలే అనుకూలం. చేయు వృత్తి వ్యాపారాలు అనుకూలం. సర్వత్రా విజయం బంధు మిత్రసహకారాలు లభించును. అనారోగ్యం, ఔషదసేవ ద్రవ్యనాశనం, బంధువులతో విరోధం, మనస్తాపం. స్వబుద్ధిప్రకారం ప్రవర్తించుట, బంధువులతో నెగ్గుకుని వస్తారు. స్త్రీలతో సంభాషణయందు ప్రీతి కలుగుతుంది. పుత్ర, మిత్ర, బంధు, కళత్రాలతో విద్యాగోష్టి చేయుట.



# తి.తి.దే. తిరుమల శ్రీవారి ఆలయ విచారణ ప్రశ్నావళి

**01) అనివార్య పరిస్థితులలో పొందిన సేవను వేరే తేదీలలో మార్పు చేసుకోవచ్చా?**

**జ.** డి.డి. ద్వారా ముందస్తుగా పొందిన సేవాటిక్కెట్ల తేదీల మార్పు చేయాలంటే అసలు సేవాటిక్కెట్టుతో బాటు మరణధృవీకరణ పత్రం/వైద్యధృవీకరణ పత్రాన్ని మరియు సేవాటిక్కెట్టు రుసుంలో 25శాతం డబ్బును అదనంగా మరొక డి.డి.ని కార్యనిర్వహణాధికారి తి.తి.దే. వారి పేరున తిరుపతి / తిరుమలలో చెల్లింపు చేయునట్లుగా జతచేసి టిక్కెట్టు పొందినవారికి అనుకూలమైన మూడు తేదీలను తెలియజేస్తు పంపాలి. అట్లే సేవామార్పుదల ఒక పర్యాయం మాత్రమే చేయబడును. తమ వినతి పత్రాన్ని నిర్ణీత సేవా తేదీకి 90 రోజుల ముందుగాని లేదా సేవ అయిన 15 రోజుల తర్వాత పంపవలెను.

**02) తులాభారాన్ని ఏవిధంగా చేయవచ్చు?**

**జ.** తులాభారాన్ని దర్శన సమయాల్లో మాత్రమే చేయాలి. తులాభారాన్ని చేయదల్చుకున్నవారు చక్కెర, పటిక బెల్లం (కల కండ), బియ్యం, బెల్లం, నాణెములు 1/-, 2/- మరియు 5/-లతో చేయవచ్చు. 1/- నాణెములు ఒక కిలోకి సమానంగా 202 రూపాయల బరువు, 2/-నాణెములు ఒక కిలోకి సుమారు 332/-రూ బరువు, మరియు 5/- నాణెములు ఒక కిలోకి సుమారుగా రూ.555/- విలువతో కూడి ఉంటుంది. ఒకవేళ యాత్రికులు చక్కెర మరియు బెల్లం మొదలైన వాటిని నగదురూపంలో ఇవ్వదల్చుకుంటే ప్రస్తుతపు మార్కెట్టుధరకు అనుగుణంగా చెల్లించాలి.

**03) దశవర్షదర్శిని మరియు వింశతి వంశదర్శిని పథకాల దాతలకు ధృవపర్చు లేఖలు అందకుంటే ఏం చేయాలి?**

**జ.** ఈ పథక గృహస్థులకు రిజిష్టర్ పోస్టుద్వారా 45 రోజులకు ముందస్తుగా విషయం తెలియజేయబడును. ఒకవేళ వారు తేదీని వాయిదా కోరితే రూ.600/- డి.డి.ని కార్యనిర్వహణాధికారి, తి.తి.దే. వారి పేరున తీసి పంపితే, వారు కోరుకున్న విధంగా తేదీని వాయిదా వేసేందుకు వీలవుతుంది.

**04) కొత్తగా పెళ్లైన దంపతులకు కల్పించు ప్రత్యేకదర్శన వివరాలు**

**జ.** తిరుమలలోని తి.తి.దేవస్థానం కల్యాణమండపాల్లో, పురోహితసంఘంలో వివాహం చేసుకున్న నూతన వధూవరులతో బాటుగా ఇరుప్రక్కల తల్లిదండ్రులకు ఎటువంటి రుసుము లేకుండా సుపథం ద్వారా మధ్యాహ్నం 12.30గం॥ నుండి సాయంత్రం 5 గం॥ వరకు ప్రత్యేక ప్రవేశం కల్పించబడును.

**05) వివిధ వర్గాల యాత్రికులకు సుపథం ద్వారా దర్శన ప్రవేశ సమయములు ఏవి?**

**జ.** పసిపిల్లలతో ఉన్న తల్లిదండ్రులకు ఉదయం 8.30గం॥ నుండి 10.30గం॥ వరకు, దాతలకు, రక్షణశాఖవారికి మరియు విదేశాలలో ఉన్న భారతీయులకు (యన్.ఆర్.ఐ) మధ్యాహ్నం 12.30 గం॥ నుండి సాయంత్రం 5.30గం॥ వరకు ప్రవేశం కల్పించబడును.

**06) తిరుమలలో రూ.300/- దర్శనానికి వచ్చినపుడు ఏవిధమైన వస్త్రధారణ ఉండాలి?**

**జ.** సంప్రదాయసిద్ధమైన భారతీయ వస్త్రధారణ ఆర్జితసేవలు మరియు ముందస్తు సేవాటిక్కెట్లు పొందినవారు విధిగా ధరించవలెను. పురుషులకు ధోవతి మరియు షర్ట్ / కుర్తా-పైజామా, మహిళలకు చీరాజాకెట్టు/లంగావోణి జాకెట్టు/ చుడీదార్ పైజామా దుప్పటతో ఉండాలి.

**07) తిరుమలలో ప్రత్యేకంగా ఆచరించే అనంతాళ్వార్ తోటో త్సవం, శ్రీరామనవమి, నాగులచవితి, గరుడపంచమిల పూర్తి వివరాలు ఇవ్వండి?**

**జ.** **1)** నాగులచవితినాడు పెద్ద శేషవాహనం నిర్వహిస్తారు. **2)** గరుడపంచమినాడు గరుడవాహనం **3)** శ్రీరామనవమినాడు ఉదయం 9గం॥ నుండి 11.00గం॥ ప్రత్యేక స్నపనతిరుమంజనం మరియు హనుమంత వాహనసేవను రాత్రి 7గం॥ నుండి 8గం॥వరకు నిర్వహిస్తారు. **4)** సహస్ర దీపాలంకారసేవ పూర్తి అయిన తర్వాత శ్రీస్వామివారిని ఊరేగింపుగా అనంతాళ్వారును తోటోత్సవానికి తీసుకెళ్లడం జరుగుతుంది.

**08) కైశికద్వాదశి అంటే ఏమిటి?**

**జ.** కైశికద్వాదశినాడు ప్రాతఃకాలంలో (సూర్యోదయానికి ముందుగానే) ఉగ్ర శ్రీనివాసమూర్తిని ఊరేగింపుగా నాలుగుమాడ వీథుల్లో తీసుకెళ్తారు. ఉగ్రశ్రీనివాసమూర్తి ఊరేగింపు అనంతరం బంగారువాకిలి వద్ద కైశిక పురాణాన్ని పఠిస్తారు. సాధారణంగా మిగతారోజుల్లో శ్రీమలయప్పస్వామిని నాలుగుమాడవీథులలో ఊరేగిస్తారు.

**09) మూలవిరాట్టుకు జరిపే ఆర్జిత సేవలను గురించి తెలపండి?**

**జ.** నిత్యసేవలు – సుప్రభాతం, తోమాల, అర్చన.
వారపు సేవలు – విశేషపూజ, అష్టదళపాద పద్మారాధనం, సహస్రకలశాభిషేకం, తిరుప్పావడసేవ, వస్త్రాలంకార సేవ, పూరాభిషేకం.

**10) పూరాభిషేకం లేదా వస్త్రాలంకార సేవను ఏ విధంగా పొందవచ్చు?**

**జ.** ఈ సేవలను ముందస్తుగా పొందలేరు. కాని, లాటరీపద్ధతి ద్వారా లభించు పరిమితిని బట్టి పొందవచ్చు. ఇది తిరుమలలో ఉన్న టిక్కెట్లను బట్టి ఉంటుంది.

ఈ కూపను కత్తరించండి




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)



## చందా నమోదు పత్రం

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి. మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

(పిన్‌కోడ్ తప్పని సరి)

సెల్ నెం.

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు ☐ సంస్కృతం సంవత్సరచందా మాత్రమే

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు : (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది : చందాదారుని సంతకం

ఇతర వివరాలకు ఫోన్ నెం.0877-2264543, 2264359

**11) సుప్రభాతం, తోమాల, అర్చనసేవలకు ప్రవేశమార్గం ఎటు వైపు ఉంటుంది?**

జ. వైకుంఠం క్యూకాంప్లెక్సు-1.

**12) భర్త మరణించిన స్త్రీలకి కల్యాణోత్సవ సేవకు అనుమతిస్తారా?**

జ. ఎవరైనా ఇద్దరు వ్యక్తులు సేవలో పాల్గొన వచ్చు. వారు దంపతులైతే సంకల్పం చేయబడును.

**13) ఆర్జిత సేవాటిక్కెట్లు ఈ-దర్శన్ కేంద్రాల్లో లభిస్తాయా?**

జ. లభిస్తాయి.

**14) కుటుంబంలోని అందరు వ్యక్తులు కాకుండా కుటుంబ పెద్ద మాత్రమే గుర్తింపుకార్డును తీసుకొని వెళ్ళి, ఇతర కుటుంబ సభ్యులకు కూడా టిక్కెట్లు పొందేటట్లు చేయవచ్చా?**

జ. ఈ సదుపాయం రూ.300/- శీఘ్ర దర్శనానికి మాత్రమే ఉంది. ఇతర సేవలకు లేదు.

ఇతర సేవాటిక్కెట్లు పొందగోరితే ప్రతిఒక్కరు వేలిముద్రను, ఫోటోను తప్పనిసరిగా ఇవ్వాలి.

**15) కరెంటు బుకింగ్ ద్వారా ఏ సేవలను పొందవచ్చు?**

జ. ఆర్జిత బ్రహ్మోత్సవం, ఊంజల్ సేవ, వసంతోత్సవం, సహస్రదీపాలంకారసేవ, విశేషపూజ టిక్కెట్లను పొందవచ్చు.

**16) ఆన్‌లైను విధానం ద్వారా ఒకసారిగా ఎన్ని టిక్కెట్లను పొందవచ్చు?**

జ. ఒక గుర్తింపుకార్డు ద్వారా కేవలం రెండు టిక్కెట్లను ఒకే సారిగా మరియు కల్యాణోత్సవం మాత్రం ఒకే ఒక టిక్కెట్టును పొందే అవకాశం ఉంటుంది.

**17) ఆన్‌లైను ద్వారా సేవాటిక్కెట్లను ఏ విధంగా పొందవచ్చు?**

జ. ఆన్‌లైన్ విధానం ద్వారా ప్రతినెల మొదటి శుక్రవారం ఉదయం 11.00 గం॥ పొందే ఆర్జితసేవా టిక్కెట్లు విడుదల చేయబడతాయి.

**18) కొత్తగా ప్రారంభించిన శీఘ్రదర్శన ప్రవేశ మార్గంలో ఇంటర్‌నెట్ ద్వారా లేదా ఈ-దర్శన్ ద్వారా టిక్కెట్లు పొందిన భక్తులు ప్రవేశించవచ్చా?**

జ. ఏ భక్తుడైనా శీఘ్రదర్శనం టిక్కెటు, ఈ-దర్శన్, ఇంటర్‌నెట్, పోస్టాఫీస్ లేదా శ్రీనివాసంలో పొందినవారు ఎ.టి.సి. సముదాయంలోని కొత్త ప్రవేశమార్గం ద్వారా ప్రవేశింపబడతారు.

**19) వయోవృద్ధులు ఒకసారి దర్శనానికి వచ్చిన తర్వాత తిరిగి ఎన్ని రోజుల తర్వాత దర్శనం చేసుకోవచ్చు?**

జ. ఒకసారి దర్శనం అయిన తర్వాత 90 రోజులు పూర్తయిన తర్వాతమాత్రమే దర్శనం చేసుకోగలరు.

**20) కరెంట్ బుకింగ్ ద్వారా సేవలను ఏ పద్ధతిలో బుక్ చేసుకోగలము?**

జ. యాత్రికులు విజయాబ్యాంక్ కరెంటు బుక్కింగ్ కౌంటర్, తిరుమల ద్వారా ఒక రోజు ముందుగా లేదా 0877-226 3724 ద్వారా సమాచారాన్ని పొంద వచ్చు.




Edited and published on behalf of T.T.Devasthanams by Dr. C.Saila Kumar, M.A.,Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by Sri V.Veerabrahmaiah, M.A., B.Ed., Dy. E.O.,(Publications & Press), T.T.D, Manager, T.T.D., Press, Tirupati - 517 507.

